

*Picasso's 100 etched drawings, which were published by the great art dealer, Ambroise Vollard, explore the beauty and simplicity of pure line.*

# మిసిమి

***"All that we are is the product of what we have thought," is "We are what we think."*** **– Dammapada.**

సంపుటి 6 | మార్చి 1995 | సంచిక 68

సంపాదకుడు: రవీంద్రనాథ్ ఆలపాటి

## విషయసూచిక



విడిప్రతి రూ. 5/- వార్షిక చందా రూ. 60/-

ముఖచిత్రం :

**Women Running on the Beach** 1922
13¼" X 16¾" Musée Picasso, Paris

# LIVING DICTIONARY
## (DEVIL'S DICTIONARY)

*Compiled by*
*AMBROSE BIERCE (1911)*

**Syllogism,** *n.* A logical formula consisting of a major and minor assumption and an inconsequent. (See LOGIC.)

**T,** The twentieth letter of the English alphabet, was by the Greeks absurdly called *tau.* In the alphabet whence ours comes it had the form of the rude corkscrew of the period, and when it stood alone (which was more than the Phoenicians could always do) signified Tallegal, translated by the learned Dr. Brownrigg, "tanglefoot."

**Take,** *v.t.* To acquire, frequently by force but preferably by stealth.

**Talk,** *v.t.* To commit an indiscretion without temptation, from an impulse without purpose.

**Teetotaler,** *n.* One who abstains from strong drink, sometimes totally, sometimes tolerably totally.

**Telephone,** *n.* An invention of the devil which abrogates some of the advantages of making a disagreeable person keep his distance.

**Telescope,** *n.* A device having a relation to the eye similar to that of the telephone to the ear, enabling distant objects to plague us with a multitude of needless details. Luckily it is unprovided with a bell summoning us to the sacrifice.

**Truce,** *n.* Friendship.

**Truth,** *n.* An ingenious compound of desirability and appearance. Discovery of truth is the sole purpose of philosophy, which is the most ancient occupation of the human mind and has a fair prospect of existing with increasing activity to the end of time.

***Truthful,*** *adj.* Dumb and illiterate.

**Turkey,** *n.* A large bird whose flesh when eaten on certain religious anniversaries has the peculiar property of attesting piety and gratitude. Incidentally, it is pretty good eating.

**Twice,** *adv.* Once too often.

**Type,** *n.* Pestilent bits of metal suspected of destroying civilization and enlightenment, despite their obvious agency in this incomparable dictionary.

**Tzetze,** (or **Tsetse) Fly,** *n.* An African insect *(Glossina morsitans)* whose bite is commonly regarded as nature's most efficacious remedy for insomnia, though some patients prefer that of the American novelist *(Mendax interminabilis).*

**Unitarian,** *n.* One who denies the divinity of a Trinitarian.

**Universalist** *n.* One who foregoes the advantage of a Hell for persons of another faith.

**Usage,** *n.* The First Person of the literary Trinity, the Second and Third being Custom and Conventionality. Imbued with a decent reverence for this Holy Triad an industrious writer may hope to produce books that will live as long as the fashion.

**Uxoriousness,** *n.* A perverted affection that has strayed to one's own wife.

**Virtues,** *n.pl.* Certain abstentions.

**Vituperation,** *n.* Satire, as understood by dunces and all such as suffer from an impediment in their wit.

# పికాసో

– 'మిసిమి'
రచనల వర్క్‌షాపు

కళా జగత్తులో ఆ నామం చిరంజీవి–చిత్రకళా ప్రపంచంలో మేరునగరంలా నిలిచిన 'వామన' దీవి – భావితరాలకు ప్రేరణ కలిగించిన కళల దీవి – పాబ్లోరూయిజ్ పికాసో. ఆధునిక చిత్రకళలో అద్వితీయుడు. చిత్రకళా ప్రియులకు సదా ఆరాధ్యుడు.

1881 అక్టోబర్ 25న స్పెయిన్‌లో జన్మించిన పికాసో, జీవితంలో అత్యధిక భాగాన్ని గడిపింది మాత్రం ఫ్రాన్సులో. ఆయన రక్తంలో ప్రవహించిన స్పానిష్, జ్యూయిష్, ఇటాలియన్ సంస్కృతులు – ద్వివిధ జాతీయ పరిసరాలు ఆయనను దేశ కాలావధులను దాటి విశ్వ విశాల కళాదృష్టిని ఆయనలో నిలిపాయి. పికాసో తండ్రి జోసె రూయిజ్ బ్లాస్కో కూడా చిత్రకారుడు కావడంతో, తండ్రి ప్రోత్సాహంతో పికాసో బాల్యంలోనే సాంప్రదాయిక చిత్రకళారీతులలో అసమాన ప్రజ్ఞ సంపాదించాడు. కేవలం 15 సంవత్సరాల ప్రాయంలో తన తల్లి చిత్రాన్ని అత్యద్భుతంగా చిత్రించిన మేధావి పికాసో. అటు తరువాత పికాసో మొత్తం జీవితం చిత్రకళకే అంకితమైపోయింది. ఆ అంకిత భావంలో ఉదయించిన సరికొత్త సృష్టి, ఆయన సాంప్రదాయిక చిత్రకళా రీతులను అధిగమించి, వినూత్నమైన విలక్షణమైన రీతులను సృష్టించడంలో నిమగ్నమైంది.

మానవ శరీరాకృతులను తనదైన శైలిలో మలచిన 'అపర విశ్వామిత్రుడు'. ఆయన చిత్రించిన 'ది త్రీ డాన్సర్స్' (1925) చిత్రకళలో అపూర్వమైన సంచలనాన్ని కలిగించి, ఆధునిక చిత్రకళలో నూతన రీతులకు మార్గదర్శకమైంది. చిత్రకళా సాంప్రదాయిక ఎల్లలను దాటి తనదైన కొత్త ప్రపంచాన్ని తన కళ ద్వారా ఈ లోకానికి అందించిన పికాసో ప్రభావం నుండి తప్పించుకున్న చిత్రకారులు చాలా కొద్దిమంది మాత్రమే ననడం అతిశయోక్తి కాదు. పికాసో మోడల్స్‌ని అట్టే ఉపయోగించుకునేవాడు కాదు. చిత్రకళలో సదా నూతన రీతులను సృష్టించిన పికాసో కుంచెనుండి నవ్యమైనది, అతిముఖ్యమైన రీతి 'క్యూబిజమ్' (cubism) ఆవిర్భవించింది. ఒక మిత్రునికి లేఖ వ్రాస్తూ, సుప్రసిద్ధ ఫ్రెంచి చిత్రకారుడు సేజాన్, ''ప్రకృతిలోని ప్రతిదాన్ని స్ఫియర్స్ కింద, కోన్స్ కింద, సిలిండర్స్ కింద మార్చవచ్చు నన్నాడు.'' ఈ సూక్తి ప్రేరణతోనే కావచ్చు, పికాసో క్యూబిస్టు కళారీతిని సృష్టించాడు. తన మిత్రులు, సహచరులైన గ్రిస్, డిరెయిన్, వ్లామింక్, మాటిస్సే, బ్రాక్యులతో కలిసి పికాసో 'క్యూబిజాన్ని' వృద్ధి చేశాడు. పికాసోను ఆఫ్రికా నాగరికత, సంస్కృతి ఎక్కువగా ఆకర్షించాయి. ఈ ప్రభావం కొంత అతని చిత్రకళపై పనిచేసింది. ఆ ప్రేరణలోనే 'నీగ్రో' కళాఖండం రూపుదిద్దుకుంది. అటు తరువాత సర్రియలిజం (Surrealism) సాహిత్యం నుంచి చిత్రకళకు రావడం మొదలై నవ్యకళా రీతులకు సాగి, నూతన దిగంతాలను తాకింది పికాసో సృష్టి.

పికాసో చిత్రకారుడే కాదు శిల్పి కూడా. అగ్గిపెట్టెలపై, సిగరెట్టులపై ఆయన కొన్ని చిత్రాలు వేశాడు. కాగితం ముక్కలను అంటించి కొన్ని చిత్రాలు చేశాడు. ఇసుకతో, బొగ్గుతో, సీమసున్నంతో కొన్ని చిత్రాలు రూపొందించాడు. శిల్పాల విషయంలో కూడా ఆయన చేయని ఇంద్రజాలం లేదు. రూపంలో నైరూప్యాన్ని, నైరూప్యంలో రూపాన్ని చూడడం పికాసో వైశిష్ట్యం. ఈ పంథాలోనే ఆకృతిని వికృతిగా, వికృతిని ఆకృతిగా రూపొందించడమన్నది ఒక్క పికాసోకే సాధ్యమైంది. ఏ సూత్రంగానీ ఏ నియమం గానీ, ఏ సంప్రదాయం గానీ ఆయనను బంధించలేక క్రొత్తదారుల్లో పోవడం మూలంగానే పికాసో తనకు తానే సాటిగా నిలిచాడు.

''కళ కళ కోసం కాదు, ప్రజా శ్రేయస్సు కోసం'' అని నమ్మిన నిజమైన కళాకారుడు పికాసో. రెండు ప్రపంచ యుద్ధాల బీభత్సంలో శిథిలమైన ప్రపంచ దురవస్థను గమనించి, తన కళ ద్వారా ప్రజలకు సందేశాన్ని, ధైర్యాన్ని అందించి వారిలోని నైరాశ్యాన్ని నిర్మూలించ ప్రయత్నించిన ధీశాలి. అందుకు నిదర్శనం ఆయన కుంచె సృష్టించిన ''గెర్నికా'' (1937). తాను చెప్పదలచుకొన్న విషయాన్ని సూటిగా, నిస్సంకోచంగా చెప్పడం పికాసో నైజం. ఆ నైజం ఆయన సృష్టించిన 'యిజా'లలో కనబడుతుందన్నది జగమెరిగిన నిజం. ''నా చిత్రకళ నాకంటె శక్తివంతమైనది. దానికేమి కావాలో నన్ను నిర్దేశించి మరీ చేయిస్తుంది'' అంటాడు పికాసో, తన కళను గురించి. ''ఎంత ప్రయత్నించినా నేను చిన్న పిల్లల్లాగా బొమ్మలు వేయలేను'' అని నిగర్వంగా చెప్పుకున్న పికాసో, సదా విలక్షణుడే! కళాస్రష్టగా తన జీవితంలో ఎప్పుడూ వైవిధ్యాన్ని ప్రదర్శించాలని కోరుకునే పికాసో దినచర్య కూడా వింతైనదే! ఆయన రాత్రంతా తన కళాసృష్టి చేసి, పగలంతా విశ్రాంతి తీసుకునేవాడు. ఆయన విలాస వంతమైన జీవితాన్ని ఇష్టపడేవాడు. పహిల్వాన్‌లా కనబడేవాడు.

## 'దక్షిణ నాయకుడు' పికాసో –

పికాసో చిత్రకారునిగా, శిల్పిగానే కాదు, వ్యక్తిగా కూడా విశృంఖలత్వం గలవాడు. అందమైన ఆడవాళ్ళంటే ఆయనకు విపరీతమైన మోజు. చిత్రకారునిగా ఎంతటి సంచలన కర్తో, శృంగార పురుషుడిగా మరో కృష్ణుడు. పికాసో శృంగార జీవితం అతని చిత్రకళకు ఇంకొంత స్ఫూర్తి నిచ్చింది. అతను తన జీవితంలో ప్రవేశించిన స్త్రీలను ''దేవత''లతో పోల్చేవాడు.

ప్రేయసిగా అతని జీవితంలో మొదట ప్రవేశించిన స్త్రీ ఫెర్నాండే ఒలివియర్. ఈమె సాహచర్యంలో పికాసో అక్రోబాట్స్ (Acrobats), డాన్సర్స్ (Dancers), హార్లెక్విన్స్ (Harlequins) చిత్రాలను, ఫెర్నాండేతో కలిసి మెడ్రానో సర్కసును చూసిన ప్రేరణతో సర్కస్ కళాకారుల చిత్రాలను సృష్టించాడు పికాసో.

1907లో *'Les Demoiselles d' Avignon'* అన్న చిత్రంతో మొదట పికాసో తన సృష్టిలో సహజత్వాన్ని తగ్గించి, రేఖాగణితాన్ని చిత్రాల్లో జోడించ సాగాడు. ఆ సృష్టి చిత్రకళా ప్రపంచంలో అపూర్వ సంచలనాన్ని రేకెత్తించింది. ఈ సమయంలోనే ఈవా అనే అమ్మాయి అతనికి చేరువైంది. పికాసో ఫెర్నాండేని వదిలించుకుని ఈవాను ప్రేమించ సాగాడు. ఈవా స్నేహంలోని ప్రేరణతోనే పికాసో 'క్యూబిజమ్'లో కొత్త కొత్త ప్రయోగాలు చేశాడు. కానీ, ఈవా ఆకస్మిక మరణం పికాసోను కృంగదీసింది. సరిగా ఈ సమయంలోనే (1917లో) జీన్ కొక్టూ, పికాసోను పెరేడ్ (parade) చిత్రీకరణ కోసం రోమ్‌కు తీసికెళ్ళాడు. అక్కడ వాటికన్‌లో పికాసో మైకెలాంజెలో, రాఫెల్ చిత్రాలను అధ్యయనం చేశాడు. అక్కడే ఓల్గా కొక్లోవా అన్న జవరాలి ప్రేమలో పడి, జూలై 12, 1918న ఆమెను పెళ్ళాడాడు. ఓల్గాయే పికాసో మొదటి లీగల్ భార్య! 1921 ఫిబ్రవరి 4న వీరి కలల పంటగా కొడుకు పౌలో పుట్టాడు.

1920 – 1930 మధ్యకాలంలో పికాసో ఆధునిక చిత్రకళలో నవ్యరీతులను సృష్టించాడు. ఆ ప్రభావం సర్రియలిజమ్ (Surrealism), ఎక్స్‌ప్రెషనిజమ్ (Expressionism), అబ్‌స్ట్రాక్ట్ పెయింటింగ్ (Abstract Painting) లపై గాఢంగా పనిచేసింది. 1927లో పికాసో 17 ఏళ్ళ మేరీ తెరెసా ప్రేమలో పడటం, ఆమె గర్భవతి కావడంతో ఆయన మొదటి భార్య ఓల్గా ఆయనను విడిచి పెట్టినా, ఆమె తన మరణాంతరం వరకూ పికాసోకు ప్రతిరోజూ సుదీర్ఘమైన ఉత్తరాలు రాసేది. తెరిసాకు ఆడపిల్ల జన్మించింది. ఆమె పేరు 'మాయ'. తరువాత డోరా అనే ఫోటోగ్రాఫర్ ఆయన జీవితంలో

ప్రవేశించింది. ఆమె తరువాత ఫ్రాంకోయిస్ అనే అందగత్తె పికాసో భార్య కాగలిగి, ఇద్దరు బిడ్డల తల్లియైన తరువాత ఆయనను వదిలింది.

1961లో పికాసో 'జాక్వెలిన్'ను వివాహమాడాడు. ఇదే ఆయన చివరి వివాహం. జాక్వెలిన్ ఆయన జీవితాంతం ఆయనకు మానసికమైన ప్రశాంతతని కలుగ జేసింది. ఆమె సాహచర్యంతో పికాసో ఉత్తమ సాహిత్యానికి తగ్గ ఉత్తమ కళాఖండాలను సృష్టించాడు. Les Femmeds D' Algers, Las Meninas, D'ejuner Sur L'Herbe మొదలైన కళా ఖండాలను జాక్వెలిన్ ప్రోత్సాహంతోనే పికాసో సృష్టించ గలిగాడు.

పికాసో సృష్టించిన దిడ్రాప్ కర్టన్ (The drop-curtain), ది షీ గోట్ (The She-Goat), ది వోల్లార్డ్ షూట్ (The Vollard Suite), గర్ల్ యిన్ ఎ కెమిస్ (Girl in a Chemise), ది అక్రోబాట్స్ ఫామిలీ విత్ ఎ మంకీ (The Acrobat's Family with a Monkey), త్రీ వుమెన్ (Three Woman), ఉమెన్ రన్నింగ్ ఆన్ ది బీచ్ (Women Running on the Beach), ది థర్డ్ క్యూబిస్ట్ (The Third Cubist) మొదలైన కళాఖండాలు చిత్రకళా జగత్తులో ఆయన ముద్రలు. చిత్రకళకు ఆయనో యుగపురుషుడు! ఆయన సృష్టించిన వినూత్న, విలక్షణ రీతులను విపరీతమైనవని విమర్శించిన వారూ లేకపోలేదు. అయినా ఆ విమర్శకులే పికాసో సృజనాత్మక శక్తిని, వైవిధ్యాన్ని గుర్తించక తప్పలేదు. పికాసో పేరు వినలేదనే వారు ఆయన కళను హర్షించలేని వారు బహు అరుదు.

1973, ఏప్రిల్ 9న ఈ కళాస్రష్ట తన కల్పనా జగత్తులో విహరించడానికి తన కాయాన్ని వదిలి వెళ్ళాడు. అయినా ఆయన శకం కొనసాగుతోంది చిత్రకళా ప్రపంచంలో.

## Feeling Good

Feeling good drives human evolution and our capacity for sexual experience. Sociobiologists like Helen Fisher, Ph.D., author of *The Sex Contract and The Anatomy of Love,* report that our ability to feel good with other people has literally driven the shape of human evolution - and prompted us to further evolve our capacity for feeling good. This is the force behind human females' evolutionary shift from estrus-related sexual receptivity to nonseasonal sexual desire; the development of a forward-tilting uterus permitting face-to-face intercourse; the natural selection of men for their capacity to pair bond; and our complex sexual-emotional interpersonal signaling system.

* * *

In contrast to a physiological model of *human sexuality,* I have developed a model of human sexuality, called The Quantum Model, that takes into account our neo-cortex and the impact of meanings and meaningfulness. We are meaning-making animals; the more meanings we bring to sex, the more richness our life has - and the greater our ability to feel good.

'షాహెన్‌షా –ఎ – ముస్సఖి మర్మామ్'

# కుందన్‌లాల్ సగైల్

సంకలనం:
రవీంద్రనాథ్

'మిసిమి'
రచనల వర్క్‌షాపు

మెయిలిని చూసి నెమలి ఆడితే, సైగల్ పాట మనుషుల మనసుల్ని తాకి ఆడుకొంటుంది. ఈ రెండింటికి సామ్యము ప్రత్యక్షంగా అల్పమైనా, పరోక్షంగా బహుళం.

నాదం నుంచే సృష్టి జరిగిందనే వాదం నిజమే అయితే పంచభూతములలో నాద మూలకమైన ఆకాశము సర్వత్రా వ్యాపన శీలమైనది. తద్గుణమగు నాదం కూడా సర్వత్రా వ్యాపించినదే 'The music of spheres'' అన్న పాశ్చాత్యుల భావన కూడా దీని అనుసరణ జనితమేననవచ్చు. నాదం (గానం, సంగీతం) ప్రతి జీవిలోనూ ఏదో ఒక రూపంలో కనబడకపోదు. ఈ సంగీతం కొందరికి సాధనతో సాధ్యమైతే, మరికొందరికి జన్మత: వచ్చినది. అలాంటి వరప్రసాదే మన కుందన్‌లాల్ సైగల్.

1904 ఏప్రిల్ 4న జలంధర్‌లో జన్మించిన కె.యల్.సైగల్, రైల్వేశాఖలో పనివారి మీద అజమాయిషీ చేసే గుమాస్తాగా తన జీవితాన్ని ప్రారంభించాడు. ఏ గురువు వద్దా సంగీతం నేర్చుకోని సైగల్‌కు పాటలు పాడటం ప్రవృత్తి. ఆ పాట అతని జీవితంలో ఒక భాగమైందనడం కంటె పాటే అతని జీవితమైంది అనడం సబబు. అతని గానాన్ని అతని చుట్టుపక్కల వారంతా విని ఆనందించేవారు. రైల్వేశాఖలో ఉద్యోగం మానివేసి సైగల్ కొంతకాలం ''టైపురైటర్స్'' అమ్ముతూ జీవించాడు. ఆ జీవనంలోనూ అతని పాటే అతని బాట. ఎక్కువగా ప్రయాణంపై మక్కువలేని సైగల్ ఆ ఉద్యోగం కూడా వదలుకొని, కలకత్తాలోని 'న్యూ థియేటర్స్'లో గుమస్తాగా చేరాడు. ఆ సంస్థలో పనిచేసుకుంటూ యథాప్రకారం కూనిరాగాలు తీస్తున్న సైగల్ గాత్రం విని, ఆ సంస్థ నిర్మిస్తున్న 'శుభ్–కా–సితారా' చిత్రంలో గాయకునిగా పరిచయం చేశారు. ఈ సంఘటన 1932లో జరిగింది. అదుగో, అప్పుడే ఓ అద్భుత గాయకుడు మన భారతావనికి అవతరించాడు. లోకం సంతోషించింది. నిజానికి సైగల్ పాడడు. అతడు పలికే మాటలే పాటగా రూపుదిద్దుకొంటాయి. అంతటి మధుర కంఠం సైగల్‌ది. తుమ్మెదల ఝుంకారాన్ని యథాతథంగా పలికించిన సైగల్ గళం అద్భుతమైనది. అమరమైనది. ఆరోహణ, అవరోహణలు పుట్టుకతోనే అబ్బిన సైగల్ సాధారణంగా అష్టమస్వరాన్ని (ఆలాపన) ఎప్పుడో ఒకసారి ఉచ్చస్థాయిలో ఆలపించేవాడు. అందుకే కాబోలు 'గానకోకిల' లతా మంగేష్కర్ ఒక ఇంటర్వ్యూలో ''సైగల్‌లాగా అష్టమ స్వరాన్ని ఆలాపించాలన్నదే తన జీవితాశయం''గా పేర్కొన్నారు.

ఒక్క లతా మంగేష్కరే కాదు. ముఖేశ్, కిశోర్ కుమార్, తలాత్ మహమ్మద్ లాంటి ప్రఖ్యాత గాయకులందరూ సైగల్‌ను ఆదర్శంగా తీసుకుని ఆయన గాత్రాన్ని అనుకరించినవారే. సైగల్ వర్ధంతి సందర్భంగా 'ఆల్ ఇండియా రేడియో' వారి కార్యక్రమంలో లతా మంగేష్కర్ సైగల్ పాట ''సోజా రాజకుమారీ!....'' ని ఆలపించగా అంతటి మాధుర్యం రాకపోయేసరికి రేడియో స్టేషన్ వారు తెలివిగా సైగల్ గాత్రాన్నే

జత చేశారు. అందుకే లత, ''చూశారా! ఇంతకీ ఆయనెక్కడా? నేనెక్కడా?'' అని వినమ్రంగా తన ఓటమిని అంగీకరించారు. అదే సందర్భంలో ముఖేశ్ ''నేను సైగల్‌గారిని కలిసి సీనియర్‌గా సలహా యివ్వమనగా ఆయన 'నన్ను (సైగల్‌ని) అనుకరించవద్దు, నీ సొంత బాణీని నీవు పెంపొందించుకో' అన్నార'ని తన అనుభవాన్ని జ్ఞాపకం చేసుకున్నాడు. అందుకే ముఖేశ్ తన తొలి పాట ''దిల్ జల్తాహై తో జల్నేదే''లో పల్లవిలో సైగల్‌ని అనుకరించి విఫలుడైనా, చరణాలలో తన గొంతులోని మాధుర్యాన్ని పలికించి విజయం సాధించాడు. ఆ తరువాత ముఖేశ్ ఎప్పుడూ సైగల్‌ని అనుకరించలేదు. సైగల్ గొంతును అనుకరించాలంటే అందరూ విఫలమౌతామేమోనని భయపడేవారు. అందుకేనేమో తలాత్ మహ్మూద్ మాత్రం లభ్యం కాని సైగల్ పాటలోని పంక్తుల నేరుకుని మరీ పాడతాడు. అయినా సైగల్ సైగలే. శ్రావ్యమైన గానం సైగల్ ఆస్తి. గాయకుల్లో అతనో మకుటంలేని మహారాజు. ఆయననెవరూ అనుకరించ లేరు. సి.హెచ్.ఆత్మ అనే మంచి గాయకుడు తన జీవిత కాలంలో సైగల్ పోలికలున్నా అనుకరించలేక పోయానని వ్యధ నొందాడు. అంతటి శక్తివంతమైన ఇంద్రజాల గాత్రం సైగల్‌ది. ఆ గాత్రంలోని సమ్మోహక శక్తి ఎవరినైనా ఇట్టే ఆకర్షించేది. సైగల్ మాత్రం ఇది ''దేవుడిచ్చిన వరమనే'' నమ్మేవాడు. అదే అందరితో చెప్పేవాడు.

ఉస్తాద్ ఫియాజ్ ఖాన్ మాత్రం, సైగల్‌ని ఒక వీధిపాటగాడిగా మాత్రమే గుర్తిస్తానన్నాడు. అయినా ఆ అపశ్రుతిని సైతం సంతోషంగా స్వీకరించిన సైగల్, నిజమైన శ్రుతి తెలిసినవాడు. అందుకు నిదర్శనం-హెచ్. యం. వి.వారు రికార్డు చేసిన ''ఝుల్నా ఝులావో రీ...'' అన్న సైగల్ పాటకంటె శ్రావ్యంగా పాడాలని ఎన్నో ప్రయత్నాలు చేసి విఫలుడయ్యాడు ఆ ఉస్తాద్ ఫియాజ్ ఖాన్.

''దుఃఖ్ కే అబ్ దిన్ బీతాత్ నహీ'', ''కరుణ్ క్యా ఆశ్ నిరాశ్ భాయి'' అన్న కరుణ రసాత్మకమైన పాటలైనా, ''ఏక్ రాజే కా బేటా'' అన్న చిన్నపిల్లల పాట అయినా, ఉల్లాస భరితమైన ''హమ్ ఆప్నా ఉన్నే బనా న సకా'' అన్న పాట అయినా ఒక్క సైగల్ గొంతు నుండి జనించడం మూలంగానే అతనికి దగ్గరలో కూడా ఎవ్వరూ రాలేకపోయారు. ఎప్పటికీ మళ్ళీ మళ్ళీ వినాలనిపిస్తాయి. ''మధుకర్ శ్యామ్ హమారే చోర్'', ''అంధేకి లాలీ తూహిహై'', ''నైన్ హీన్ కోరామ్ దిఖా ప్రభూ!'', ''నిస్ దిల్ బర్సాత్ నైన్ హమారే'' అన్న పాటలు ఎంతటి కఠిన హృదయులనైనా కరిగించి కన్నీరు పెట్టించక మానవు. ఆయనను గాయకుడిగా చలన చిత్రరంగానికి పరిచయం చేసిన బి.యన్.సర్కార్ (న్యూ థియేటర్స్, కలకత్తా)తో కలిసి పాడిన 'కొంటె పాటలు' సైతం అందరినీ ఆసక్తిలో ముంచుతాయి. సైగల్‌ను గాయకుడిగా తీర్చి దిద్దడంలో తోడ్పడిన పంకజ్ మల్లిక్‌ని సైతం అనతికాలంలోనే అధిగమించాడు సైగల్. ఒకసారి సైగల్ జలుబు కారణంగా ఒక సినిమాకు పాటలు పాడలేకపోయాడు. ఆ సంస్థవారు పంకజ్ మల్లిక్‌తో పాడించి విడుదల చేయగా ఆ సినిమా 'బాక్సాఫీసు' వద్ద ఘోరపరాజయాన్ని చవిచూసింది. సైగల్ కోలుకున్న తరువాత అదే సినిమాకు అవే పాటల్ని సైగల్ చేత పాడించి, మళ్ళీ విడుదల చేయగా అఖండ విజయం సాధించిందాచిత్రం. అంతటి ఇంద్రజాలం సైగల్ గొంతులో ఉంది. అయినా పంకజ్ మల్లిక్‌గానీ, ఎవరూగానీ సైగల్‌పై అసూయ, ద్వేషం పెంచుకోలేదు సరికదా అందరూ ఆయనను, ఆయన గానాన్ని అభిమానించేవారే.

సైగల్ గానం ఎంతటి ఉన్నతమైందో, అతని శీలం, వ్యక్తిత్వం కూడా అతని కీర్తి శిఖరానికి సమాన స్థాయిలో ఉండటం విశేషం. ''ఉదార చరితానాం తు వసుధైక కుటుంబకమ్'' అన్నట్లు సైగల్‌కు రాజూ-పేదా తేడాలు ఉండేవి కావు. ఒకసారి సైగల్ తన మిత్రుడైన ఓ ధనవంతుడి పార్టీలో ఉండగా ఆ మిత్రుడు సైగల్‌ని పాట పాడమని కోరాడట. అందుకు సైగల్, ''నీకు నా పాట వినాలనిపిస్తే మా ఇంటికి వచ్చి ఫీజు చెల్లించి నా అపాయింట్‌మెంట్ తీసుకో, అప్పుడు వీలైతే నేను పాడగలను'' అన్నాడట. కానీ అదే సైగల్, మరోసారి ఓ పేదవాడు అతని తలుపు తట్టి, ''మీ పాటకచేరి టిక్కెట్టుకొని మీ పాట ప్రత్యక్షంగా వినే స్తోమత నాకు లేదు. అయినా మీ పాట ప్రత్యక్షంగా వినాలన్నది నా జీవితాశయం'' అంటూ భయంతో వణుకుతూ అడగ్గా సైగల్ అతణ్ణి సాదరంగా ఆహ్వానించి, అతిథి మర్యాదలు చేసి, కేవలం అతని కోసం మూడు గంటలపాటు ఏకధాటిగా పాడాడు. సైగల్ మాటల్లో కాదు, కాదు పాటల్లో చెప్పాలంటే ఎవరూ ధనవంతుడు కానీ, ఎవరూ పేదవాడు కానీ లేడంటాడు సైగల్. 'అందరమూ విధి చేత చిక్కినవారమే' అన్నది అతని నమ్మకం. శక్తివంతమైన వ్యక్తిత్వం కలిగిన సైగల్ శీలవంతుడిగానూ ఉన్నతుడే. ఆయన కుమార్తె శ్రీమతి నీనా మర్చంట్ 4 డిశంబర్, ౧౯౯౩ ఒక లేఖలో ''కొంతమంది మా నాన్న గారి జీవితాన్నో ప్రణయగాథగా చిత్రించాలని చూశారు. కానీ మా నాన్న ఎన్నడూ ఎవరితోనూ ఎలాంటి ప్రణయ సంబంధం ఏర్పరచుకోలేదు. ఒక్క మా అమ్మతో తప్ప. మా అమ్మ చాలా అందంగా ఉండేది. మా నాన్నకు మా అమ్మ అంటే ప్రాణం. నేను పుట్టిన రోజున మా నాన్న విపరీతమైన జలుబుతో బాధపడుతూ కొంచెం 'బ్రాందీ' సేవించారు. తరువాత అది ఆయన అలవాటుగా మారింది. కుటుంబ స్నేహితులైతే తప్ప ఏ స్త్రీలూ కథానాయికలుగానీ, మహిళాభిమానులుగానీ ఎవరూ మా ఇంటికి వచ్చేవారు కాదు. మా నాన్న శీలవంతుడు'' అని చెప్పుకుంది.

తన గాత్రంతో స్వరాల మాయాజాలం చూపే సైగల్ జనన, మరణ కాలాల విషయంలో భిన్న స్వరాలు వినిపిస్తున్నాయి. 'గ్రామ ఫోన్ కంపెనీ ఆఫ్ ఇండియా'కు చెందిన శ్రీమతి రోనితామిత్రా చెప్పిన దాని ప్రకారం రికార్డుల మీద ౧౯౦౪-౧౯౪౬ అని ఉన్నది కానీ, సైగల్ కుమార్తె శ్రీమతి నీనా మర్చంట్ మాత్రం ఆయన జీవిత కాలాన్ని ౧౯౦౫-౧౯౪౭గా చెబుతున్నారు.

హిందీ, ఉర్దూ, పంజాబీ, పర్షియన్, తమిళ, బెంగాలీ భాషల్లో తన గాత్రాన్ని వినిపించి ఎన్నో హృదయాలను ఆనంద డోలల్లో ఊగించిన సైగల్ మొత్తం ఎన్ని పాటలు పాడాడన్న ఖచ్చితమైన సంఖ్య తెలియడం లేదు. యం.వి. కామత్ అనే ఆయన ప్రకారం సైగల్ అన్నిపాటలు భారతదేశంలో ఇద్దరి వద్ద మాత్రమే ఉన్నవి. వారిలో ఒకరు ప్రఖ్యాత హిందీ నటులు అశోక్ కుమార్, మరొకరు విఖ్యాత క్రికెటర్ బి.యస్. చంద్రశేఖర్. చంద్రశేఖర్ మాత్రం సైగల్ పాటలు వినడానికి మాత్రమే ప్రత్యేకంగా ఒక టేప్ రికార్డర్‌ని ఉపయోగిస్తారట. ఆయన ఆ టేప్ రికార్డర్‌ని, సైగల్ పాటల కేసెట్స్‌ని పవిత్రంగా భావిస్తారట. ఐ.యన్.ఆర్.ఇ.సి.వో (INRECO) వారు ౧౯౭౦లో స్టీరియో ఫోనిక్ విధానంలో 'కె.యల్.సైగల్ పాటల ఆల్బమ్'ని విడుదల చేశారు. కానీ 'స్టీరియో సూపర్ ఇంపోజిషన్' మూలంగా ఆ ఆల్బమ్‌లోని సైగల్ గాత్రం సరిగా వినిపించక,

అభిమానులకు బాధ కలిగించింది. సైగల్ ఎప్పుడూ తక్కువ వాయిద్యాలతోనే పాడేవాడు. చాలావరకు హార్మోనియం, తబలాలను మాత్రమే వినియోగించుకొనేవాడు. ''అబ్ మై క్యా కరూం కిత్ జా'' అన్న పాటకు అసలు వాయిద్యాలు తోడు లేవు. అసలు సైగల్ కంఠానికి నేపథ్యసంగీతం అనవసరము అనేవారున్నారు. ఎన్నో సైగల్ పాటలను గమనిస్తే ఆయనకు మాత్రమే సాధ్యమైన ఆరోహణ, అవరోహణ క్రమబద్ధతలు స్పష్టం కాగలవు.

౧౯౫౦ నుండి పాకిస్తాన్ రేడియో సైగల్ పాట వినిపించే ముందు ''షాహెన్‌షాహి మౌషిఖి మెర్హూమ్ కుందన్‌లాల్ సైగల్'' అని ఆయనను గౌరవిస్తూండగా, మన ఆకాశవాణి, దూరదర్శన్‌లు ఆ మహా గాయకుడి పేరు జ్ఞప్తికి తెచ్చుకోకపోవడం విచారకరం. అయితే 'సిలోన్ రేడియో' మాత్రం కె.యల్.సైగల్ అనే పేరునైనా గుర్తుంచుకోవడం విశేషం! ప్రతిదినం ఉదయం గం. 7.55 ని.లకు ఆ ఇంద్రజాల గానాన్ని వినవచ్చు. జనవరి ౧౮ సైగల్ వర్ధంతి, ఏప్రిల్ 4 సైగల్ జయంతి తేదీలలో మాత్రం రోజంతా ఎప్పడైనా ఆ మధుర స్వరాన్ని వినవచ్చు. ౧౯౭౦లో 'ఆల్ ఇండియా రేడియో' వారు 'వివిధ భారతి'లో రెండు అద్భుతమైన కార్యక్రమాలు నిర్వహించారు. అందులో ఒకటి ప్రసిద్ధ సంగీత దర్శకులు, దర్శకులు, నటులు ఆయన పాటలను గుర్తు చేసుకుంటూ ఆయనకు అర్పించిన నివాళి. మరొకటి ఏకధాటిగా గంటసేపు సాగిన సుప్రసిద్ధ సంగీత దర్శకులు నౌషాద్ సంగీత విభావరి. అందులో నౌషాద్ సైగల్ పేరును విస్మరించడం సంగీత అభిమానులకు విస్మయం కలిగించింది. కానీ, 'వివిధ భారతి'లో ''పత్తర్ బోల్ ఉఠే'' పేరున సైగల్ జీవితంలోని కొన్ని సంఘటనల ద్వారా సైగల్ మానవత్వాన్ని గురించి తెలియజేసి సంతోషపరచింది.

ఎదుటి వారికి నీతులు చెప్పి, తాము పాటించకుండా ఉండే వారి కోవకు చెందకుండా సైగల్ తన పాటల ద్వారా ఏ సందేశం తెలిపాడో ఆ సందేశానికి కట్టుబడి ఉన్న మహామనీషి. ''రెహ్మత్ పే తేరి మేరేకో నాజ్ హై, బందాహూ మై జాన్తాహూ, తూ బందా నవాజ్ హై'' అంటూ తనను తాను దేవునికి బందీగా చేసుకున్న ఆస్తికుడు. సైగల్ పాడిన పాటల్లో ఏది గొప్పదో చెప్పాలంటే కష్టం! ప్రయత్నించినా వ్యర్థం! ఆయన ప్రతిపాటా అమూల్యమైన ఆణిముత్యం. ''బాబుల్ మోరా నైహార్ ఛోటా జాయే'', ''దియజలావ్'', ''లగ్ గయి చోట్ కరే జ్వామే'', ''లాభ్ సహిపీకి బాతీయా'', ''అబ్ క్యాబాతా మై తేరే మిల్నే సే క్యామిలా'', ''దునియా మైహూ, దునియా కా తలబ్‌గార్ నహీ'', ''పీయేజా అవుర్ పీయేజా'' - ఈ పాటల్లో ఏది గొప్పదో చెప్పలేము. ఆయన కంఠం నుండి జాలువారిన పాటలన్నీ చిరంజీవులే నన్నది మాత్రం నిత్యసత్యం. ''పంజాబ్ యూనివర్శిటీ (చండీగడ్)'' వారు 'సైగల్ బాణీ' మీద ఒక ప్రత్యేకమైన కోర్సు ప్రవేశపెట్టాలన్న ఆలోచనలో ఉండటం ఆనందించదగ్గ విషయమే.

సైగల్ తన మొదటి చిత్రం ''శుభ్ కా సితారా'' నుండీ తన ఇంద్రజాల కంఠంతో శ్రోతలకు, ''దేవదాసు''లో ''బాలమ్ ఆయే బాసో మేరే మన్ మే'' అంటూ పాడుతూ, నటించి ప్రేక్షకులకు తన సమ్మోహక శక్తితో ఆరాధ్యుడైనాడు. ఇప్పటి వరకూ అంతటి సమ్మోహక శక్తికలిగిన నట, గాయకుడెవరూ భారత దేశంలో లేరనే చెప్పక తప్పదు. భారత దేశంలో సంగీతం గురించి ఎప్పడు, ఎక్కడ మాట్లాడినా విన్పించే మహత్తర నామం కె.యల్. సైగల్.

'మనసు' కవి ఆచార్య ఆత్రేయ తొలి సినిమా గీతం 'పోరా బాబూ! పో....' (దీక్ష 1950) సైగల్ గానం ప్రేరణతోనే రచించారట. 1934లోని సైగల్ "దేవదాసు" ప్రభావం భారతదేశమంతటా ఉండటంతో, తెలుగులో "దేవదాసు"ను నిర్మించే సమయంలో (దాదాపు 18 ఏళ్ళ అనంతరం, 1952లో) కూడా దర్శక, నిర్మాతలు, సంగీత దర్శకుడు ఎంతో ఆలోచించి చివరకు శరత్ 'దేవదాసు'ను మూలంగా తీసుకుని 'దేవదాసు' పాత్రను మార్చుకున్నారు. అంతేగాకుండా సంగీతంలో పాశ్చాత్య స్వరాలను ఆశ్రయించవలసి వచ్చింది. అందుకే శ్రీమతి షబనా ఆజ్మీ ఇటీవల దూరదర్శన్‌లో "మోర్టల్ మెన్ ఇమ్మోర్టల్ మెమొరీస్" (Mortal men Immortal Memories) కార్యక్రమంలో, "హిందీ చిత్రరంగంలో అద్భుత తారగా, భారతదేశంలో గాత్ర మాయావిగా నిలిచిన సైగల్ ప్రతీ పాటా మనల్ని మత్తెక్కించకమానదు" అన్నది నిజమే ననిపిస్తుంది.

సైగల్ కిష్టమైన పాట "హమే జీకే క్యా కరేంగే, జబ్ దిల్ హీ టూట్ గయా" (హృదయం పగిలిపోయాక మనం జీవించి లాభమేమి?) అంటూ లోకంతో పనిలేదనుకున్నారేమో. లేక "ముహ్ పార్ లగీ హై, మోహ్రే ఖామోషీ మై క్యాకహూ? జో మౌత్ నే కహా హై వో హస్తి కా రాజ్ హై" (మౌనంతో పెదవులు మూత పడితే నేనేం చెప్పను? మరణం అస్తిత్వం యొక్క రహస్యం చెప్పింది) అని అస్థిత్వ రహస్యాన్ని తెలుసుకున్నాక ఈ లోకంలో ఉండటానికిష్టం లేక జనవరి 18, 1946లో 42 ఏళ్ళ వయసులోనే శాశ్వతంగా మూతబడిన పెదవులు, ఈనాడు మన మధ్య లేకపోయినా ఆ పెదవుల నుండి బయల్పడిన పదాలు మన మనసులను తాకుతూనే ఉంటాయి.

**'కుందన్ లాల్ సైగల్ గానం' చరిత్రలో నిలిచిపోయిన మహత్తరమైన అద్భుతం.** •

*The point, however, is this : "one cannot be a Christian or Muslim if one does not believe in God and the Saviourship of Christ or Muhammad's being the last and perfect prophet of God; and one cannot be a Buddhist or Jain if one believes in God, from whom proceeds the world, is sustained by him and is dissolved in / by him. But a Hindu was always free to hold any beliefs, provided he did not challenge or flout the socio-political order. Let us presume K.B. Krishna was conscious of these implications when he titled his book Hindu Materialism. A title like ""Christian/ Islamic Materialism," or even ""Buddhist/Jaina Materialism" makes no sense, while ""Hindu Materialism" does.*

*- Prof. K. SATCHIDANANDA MURTY.*

# సమగ్ర ఆంధ్రసాహిత్యం - అసమగ్ర సమీక్ష

– సూర్యదేవర రవికుమార్

1965-68 మధ్యకాలంలో వెలువడిన శ్రీ ఆరుద్రగారి 'సమగ్ర ఆంధ్ర సాహిత్యం' సంపుటాలు కొన్నాళ్లక్రితం పునర్ముద్రణమైనాయి. కడపటి రాజుల యుగం దాకా అప్పుడు వెలువడిన సంపుటాలేకాక క్రొత్తగా కుంఫిణీ యుగం, జమీందారీ యుగం, ఆధునిక యుగంలపైన కూడా సంపుటాలు వెలువడ్డాయి. ఆదిమ చాళుక్యయుగం నుండి కడపటి రాజుల యుగం దాకా వెలువడిన పునర్ముద్రిత సంపుటాలను చదివినప్పుడు నాస్వల్ప బుద్ధికి తోచిన కొన్నిస్ఖాలిత్యాలను గూర్చి ప్రస్తావిస్తున్నాను. (వారి కుంఫిణీ యుగంపై నా విపుల సమీక్ష 'తెలుగు' మాసపత్రిక 1993 నవంబరు సంచికలో ప్రచురించబడింది).

రెండవ సంపుటంలోని 30వ పుటలో 'కాదంబరి దశకుమార చరిత్రలా కుమారసంభవమూ కాకతీయ యుగంలో చంపూ కావ్యాలుగా తెలుగులో అవతరించటంవల్ల' అని పేర్కొన్నారు. పునర్ముద్రిత సంపుటాలలో కుమారసంభవ కావ్యాన్ని చాళుక్య యుగంలో అవతరించిన కావ్యంగా వివరించారు. అయితే తదనుగుణంగా పై పాతసంపుటాలలోని వాక్యాన్ని మార్చలేదు.

''శ్రీనాథుని తరువాత ఈ గాథాసప్తశతి నిధి జోలికి అనంతకృష్ణశర్మ గారు తప్ప ఇంకెవరూ పోలేదు'' అని మూడవ సంపుటం 288వ పుటలో ఒక తీర్పు చెప్పారు. అది అన్యాయం. రాళ్ళపల్లి వారికంటె ముందుగా వేటూరి ప్రభాకరశాస్త్రి గారు, తల్లావఝుల శివశంకరశాస్త్రి గారు దీనిని అనువదించారు. అవి సంపూర్ణానువాదాలు కావు. అనంతకృష్ణశర్మ గారిదీ సంపూర్ణానువాదం కాదు. మరికొందరు కూడా కొన్ని కొన్ని గాథల్ని అనువదించారు కాని సంపూర్ణానువాదాలు వెలువరించిన వారు నాకు తెలిసి ఇద్దరే ఉన్నారు. ఒకరు గట్టి లక్ష్మీనరసింహశాస్త్రి గారు మరొకరు వాసిరెడ్డి వెంకట సుబ్బయ్య గారు.

నాల్గవ సంపుటంలో పినవీరన గురించిన ప్రకరణంలో నరసింగరాయలు - అన్నమయ్యల సంబంధాన్ని వివరిస్తూ ఒక అథోజ్ఞాపికలో 'ఈ సంపుటంలోనే పుట 152' అన్నారు. ఈపుట సంఖ్యపాత (1965-68) కాలపు సంపుటానికి సంబంధించినది. పునర్ముద్రిత సంపుటానికి సంబంధించి ఇది 253.

అయిదవ సంపుటంలోని 'ఇతర కవులు' శీర్షికలో యాదవామాత్య కవిని పేర్కొంటూ శ్రీ ఆరుద్ర అతడు 1520 దాకా జీవించి యుండవచ్చునని, విక్రమార్క చరిత్ర, లక్షణ శిరోమణి అను యాదవామాత్య ఛందము అతని రచనలని వివరించారు (పుట 385) ఇదే కవిని మళ్ళీ పదవసంపుటంలో 'బాపన్నగారి యాదయ్య'గా పేర్కొంటూ ఇతడు విక్రమార్క చరిత్రను వచనంగాను, చంద్రహాస చరిత్రను నిర్వచనంగాను వ్రాశాడని వ్రాశారు.

బొమ్మలాట సాంబయ్య అన్న కవిని గూర్చి 5వ సంపుటంలో (పుట 318) వ్రాస్తూ ఇతడు ఇంకా ప్రాచీనుడై ఉండవచ్చునని అన్నారు. అయితే మళ్ళీ 10వ సంపుటం పుట 190లో ఇతనిని, ఇతని కృతినీ గూర్చి వివరించారు.

షట్చక్రవర్తి చరిత్రను వ్రాసిన రామచంద్రయ్య అన్న కవిని గురించి 5వ సంపుటం 318వ పుటలో 'ఇతని కాలన్నిర్ణయం సులభంగా తేలే విషయం కాదు' అని వ్రాశారు. మళ్ళీ ఇదే కవిని గురించి 10వ సంపుటం పుట 171లో ప్రత్యేకంగా వివరించారు.

ప్రాచీన కవులలో పలువురి కాలన్నిర్ణయాలు సులభంగా తేలే విషయాలు కావు. అటువంటి వారిని ఏదో ఒక కాలానికి సంబంధించిన వారుగా నిర్ణయించి వారిని గూర్చి వ్రాయటం సమంజసంగాని ఒకే కవిని వివిధ కాలాలకు చెందినవానిగా వ్రాయటం రచనా ప్రణాళికలోని లోపాన్ని చెప్పక చెపుతుంది.

సమగ్ర ఆంధ్ర సాహిత్యం తొలిముద్రణ కాలం నాటికి అముద్రితంగా ఉండి అనంతరం ముద్రించబడిన ప్రబంధాలను పునర్ముద్రిత సంపుటాలలో కూడ అముద్రితంగానే చూపటం దారుణం.

6వ సంపుటం 39,64 పుటలలో తెనాలి రామభద్రకవి ఇందుమతీ పరిణయం అముద్రితమని చెప్పబడింది. కాని ఇది 1972లోనే హైదరాబాద్ ప్రాచ్య లిఖిత పుస్తక భాండాగారము వారిచే ప్రచురించబడింది.

అలాగే అదే సంపుటం 343వ పుటలో అముద్రిత గ్రంథంగా పేర్కొనబడిన నారన సూరన ఉదయనోదయ కావ్యం కూడా పై పుస్తక భాండాగారము వారిచే ప్రచురించబడింది.
తిక్కన విరాటపర్వం 1-111 వచనంలోని 'అనాదరమందస్మిత సుందర వదనారవింద' అన్న పాఠాన్ని గూర్చి అధఃసూచికలో ''సరియైన పాఠ నిర్ణయానికి ఉస్మానియా విశ్వవిద్యాలయం వారు వేసే ప్రతి కోసం వేచి ఉందాం'' అని వ్రాశారు. ఆ ప్రతికూడా ఏనాడో ముద్రితమై వెలుగు చూచింది. అలాగే 'శ్రీనాథ పదప్రయోగకోశం' వెలువడినా అది ఇంకా వెలువడవలసే ఉన్నదన్న పాతమాటను మార్చుకోనే లేదు. (3వ సంపుటం పుట 375).

ఈనాటి ప్రకాశం జిల్లా కేంద్రమయిన ఒంగోలును గుంటూరు జిల్లాలోని తాలూకాగా (సం.6. పుట 349), ప్రకాశంజిల్లా గ్రామమైన వెలగపూడి గ్రామాన్ని గుంటూరు జిల్లా గ్రామంగా (సం.6. పుట 33), ప్రకాశం జిల్లాలోనివే అయిన చదలవాడ (సం. 6. పుట 65), సోమరాజుపల్లె (సం.4 పుట 310) గ్రామాలను నెల్లూరు జిల్లాలోనివిగా పేర్కొనటం పాత సంపుటాలను సవరించటంలో రచయిత తగినంత శ్రద్ధ చూపలేదనేందుకు నిదర్శనాలు. ◆

*"Another facet of the spirituality of sex reveals itself when people approach their sexual potential. There is a spontaneous shift in the nature of desire, from desire out of emptiness to desire out of fulness. The "blue-balls" or "horniness" biological model of desire that currently pervades both professional practice and society, is desire out of emptiness. It presumes that once you reach orgasm, you aren't interested in your partner anymore".*

# మన కథాసాహిత్యంలో ఒక గొప్ప పాత్ర

- మధురాంతకం రాజారాం

ఒకరు చేసిన నేరానికి గాను మరొకరు శిక్షకు గురిగావడం చాలా దారుణమైన విషయం. ఈ సంగతి లోకులకు తెలియక పోలేదు. అయినా సరే, సభ్య మానవసమాజం ఆమె పైన కించిత్తు సానుభూతినైనా చూపించ లేదు. ఆమెఉనికిని, మనికిని ఏవగించుకున్నారు. ఆమెను జీవచ్ఛవంగా మార్చేశారు. ఇది ఒక భద్ర మహిళ దీనగాథ. ఇది ఒక కులాంగన దుఃఖగాథ. 'అనంత యుగాల అభాగ్య మహిళల అశ్రువులా నీ అపార జలధులు రాజా! ఓ సాగరరాజా!' అనుకోవలసిన హృదయ విదారక గాథ. అవును. ఇదొక సుశీల కథ!

ఆమె అయినింటి ఆడపడుచు. ముద్దుగానే అయినా హద్దుల్లో పెరిగింది. పెద్దల అదుపాజ్ఞల కట్టడిని శిరసావహించింది. పుట్టినింటికీ మెట్టినింటికీ పేరు తేవడమే నారీ జన్మకు పరమార్థమన్న సాంప్రదాయిక విశ్వాసంతోనే పెరిగింది. ప్రసన్న వర్తనమనే పరిమళాలు వెదజల్లుతూ ఆమె విరిసీ విరియని విరజాజి పువ్వులా అత్తవారింట్లో కాలుమోపింది.

అక్కడ మాత్రం? పెద్దల కనుసన్నల్లోనే మసలింది. బంధుమిత్రులకు ఆత్మీయురాలుగా మెలగింది. కష్టాల్లో వుండే వాళ్లని కనికరించింది. ఆచారాల్ని అనుసరించింది. అన్నింటికన్నా ముఖ్యంగా భర్తను 'పతిదేవుడు'గా సంభావించింది. 'చురుకైన ముఖం, మల్లెపువ్వులాంటి బట్టలు, చెదరని క్రాపు, పరిసరాల్ని క్రమ్మివేసే పారిస్ యుడికులోన్ వాసన...' యిలా భర్తకు సంబంధించిన సమస్త విషయాలను ప్రాణప్రదంగా భావించగలిగింది.

ఆ భార్యకు భర్తపట్లగల అనురాగ మమకారాలనుమరింత విశదం చేయాలంటే కథలోని వాక్యాలనే ఉటంకించాలి- "అతను ఆమె బహిః ప్రాణం. అతన్ని చూచి ఆనంద పడుతుంది. గర్వపడుతుంది. అతను లేని జీవితం ఆమెకు లేదు. అతనికి చిన్న జలుబుచేసినా, ఏమైపోతాడోనని భయపడి, అతడు క్షేమంగా వుంటేచాలని పరమేశ్వరుడికి మ్రొక్కుతుంది. అతడు ఇంట్లో నుంచి బయల్దేరినప్పటినుంచి ఆమె మనసు భయంతో వణికిపోతుంది. బయల్దేరిన రైలు సవ్యంగా గమ్యం చేరేనా? దోవలో ఎన్ని మలుపులు, ఎన్ని అవరోధాలు, ఎన్ని అపాయాలు! అన్నింటినీ తలచి తలచి భర్త క్షేమం కోసం ఎంతగానో ఆరాటపడి, తపించి, ధ్యానించి మ్రొక్కి, వెయ్యి కళ్లతో ఎదురుచూచి, అతడు కనిపించగానే మహానందంతో ఆహ్వానించి'' యిలా ప్రతిక్షణమూ అతనికోసమే బ్రతుకుతుందామె.

ఏమాట కామాట చెప్పుకోవాలి. భర్త గూడా ఆమెను తన ముంజేతి రామచిలుకలాగే చూచుకుంటూ వచ్చాడు.

మున్నైయేళ్లొచ్చేదాకా ఆమె జీవిత యాత్ర యిలా ఏటవాలులో పూల తెప్పలాగే సాగిపోయింది.

---

### సరిగ్గా అక్కడే ఒక ఎదురుదెబ్బ!

ఆ దెబ్బ తినక మునుపు ఆమె జీవితం వేరు. తిన్న తర్వాత ఆమె జీవితం వేరు. అప్పుడది నాకలోకం. ఇప్పుడది రౌరవనరకం! అప్పుడది పైరుపచ్చల రమణీయ దృశ్యం. ఇప్పుడది సహారా మరుభూమిలాంటి పెనుబీడు. అప్పుడామెకు అడుగుకు మడుగులొత్తే సన్నిహితరక్త బంధువులు, ఆరోప్రాణంగా భావించే భర్త, గౌరవించే యిరుగు పొరుగు వాళ్లు-అందరూ వున్నారు. ఇప్పుడెవరూ లేరు ఒక్క లింగప్ప తప్ప!

### ఎవరా లింగప్ప? ఏమా కథ?

అయితే బిడ్డను గురించి చెప్పడానికి ముందుగా తల్లిని గురించి చెప్పాలి గదా! చెట్టును గురించి చెప్పడానికి ముందు వనాన్ని గురించి చెప్పాలి గదా! అట్లాగే లింగప్పను గురించి చెప్పడానికి ముందుగా అనంతపురం గురించి చెప్పాలి. అనంతపురం ప్రసక్తి వచ్చినప్పుడు ఆవూరి చెరువును గురించి, ఆ చెరువును గురించిన ప్రస్తావన వచ్చినప్పుడు దాని గట్టుపైన వెలసిన గణేశుని గుడిని గురించి గూడా చెప్పడం తప్పనిసరి!

''ఏడాది క్రిందట లింగప్ప గోపాలరావుగారి బ్యాంకులో వాచ్‌మన్‌గా చేరాడు. నలభై ఏళ్లవయసు, మోకాళ్ల నొప్పులు, కూర్చుని లేస్తే బాధతో మొహం చిన్నదవుతుంది. పనిచేస్తేగానీ ఇంట్లో గడవని స్థితి...ఇక్కడ పని ఖాళీ వున్నదని తెలిసి వచ్చాడు. సుశీలమ్మకు జాలివేసింది. గోపాల్ లింగప్పను పరీక్షించి పని యిచ్చాడు. రాత్రి బ్యాంకులో నిద్రపోతాడు లింగప్ప. పగలు కొంతసేపు యింట్లో తోటపని చూస్తాడు. పనిలేనప్పుడు సుశీలమ్మ లింగప్ప కబుర్లు ఉత్సాహంగా వింటుంది...'' ఈపాటి పరిచయ వాక్యాలతో లింగప్ప కథలో ప్రవేశించాడు.

### ఆ లింగప్ప సుశీలమ్మ కళ్లకెలా కనిపించాడు?

''కొండలాగా, చెట్టులాగా, బుక్కరాయ సముద్రం చెరువులాగా అనిపిస్తాడు లింగప్ప ఆమెకు. లింగప్ప కబుర్లు వింటుంటే మనసు ఏదో స్వేచ్ఛను పొందుతుంది. ముసలితనం, నొప్పులూ అన్నీ విడిపోయి ఒక జీవవాహినిగా మారిపోతాడు. తన బంధువుల్ని, వంశ చరిత్రను, యర్రగడ్డను, అందులోని వనాంతరాల్ని, దేవుళ్లను, దేవుళ్లకు జరిపిన పరసల్నీ తాను తిరిగిన దేశాల్ని, వాసనా జీవులైన బంధువుల్ని, మనిషి జాతిని, దాన్ని నడిపే ధర్మాన్ని అన్నింటినీ ఆక్రమించుకుని పెరుగుతాడు లింగప్ప.''

''ఆ బిటీషు రాజ్జెంలో సంగతి....'' అంటూ ప్రారంభించి తాతలనాటి కథలన్నీ తవ్వి పోస్తాడు--'' మాబెద్దోల్లు-నాయనలు, పెదనాయనలు, - గుంపు పెద్దది. యాభైమంది. మావొమిశానికంతా నేను మిగిల్నాను. మామేనమామల యింటికి ఒకడు మిగిలినాడు. తక్కిన జనాలు యాడబోయినారో....'' చివరికొచ్చేసరికి గొంతు క్రమంగా తగ్గిపోతుంది. తల వూపుతూ దీర్ఘంగా అంటాడు. 'అవును మరి. ఏనాటికైనా కాటిదిక్కుకు పోవల్సినోల్లమేగదా? -సుఖం, దుఃఖం, జబ్బు, చావు- అన్నీ జీవితంలో భాగమే లింగప్పకు- అనుకుంటుంది సుశీలమ్మ. ఓపిగ్గా వింటూ కూర్చుంటే ఎంతదూరమైనా సాగిపోతుంది లింగప్ప కథనం :

-''తొలీత వూళ్ళో పార్టీలుపడతారు. సదువులకని పిల్లలు, అంబడే ఒక ముసల్ది వచ్చి సంసారం పెడతారు. తరవాత ఒక ఎనుంగొడ్డును వట్టి పాలమ్ముతారు. రాంగరాంగ వూర్లోని భూవీ, ఇల్లూ అమ్ముకొని ఇక్కడే సేరిపోతారు. నీదేవూరంటే అనంతపురం అంటారు... అప్పుడు నేను వాల్లని

ఒకే మాటడుగుతా. 'నీది మొదట్నుంచీ అనంతపురమైతే తొలితొలీగ యీ వూరెంతుండిందో సెప్పు, అప్పుడు వాల్యూవుండిన మనసులెవురో, ఇప్పుడెవురో సెప్పు' అని. 'ఆ, నేవొచ్చి ముప్పైయేళ్లయింది... నీదే వూరు' అంటారు. 'మాది యీ వూరో! ఎక్కడ నుంచి ఒచ్చినానో అంటా....'' వినయంగా వంచిన తలను వూపుకుంటూ నవ్వుకుంటూ బోడినెత్తి తడుముకుంటాడు లింగప్ప.

లింగప్ప, అనంతపురమూ నలభైయేళ్ళూ కలిసే వున్నారు- అనుకుంటుంది సుశీలమ్మ. గొర్రెల్ని మేపుకుంటూ యర్రగడ్డంతా తిరిగినవాడు లింగప్ప. జనమన్నా, జనావాసాలన్నా అతనికి తన ప్రాణమంత ఇష్టం. ''గార్లదిన్నె, కనంపల్లి, తలగాసువల్లి, గుమ్మేవల్లి, పోతురాయి, నాగసంద్రం, ఒంకొరేసు కాలవ, అంతరగంగ, కంగల్ల, వుప్పేరు....'' అంటూ వూళ్ల పేర్లన్నీ చాక్లెట్లు చప్పరించినంత ప్రీతితో నోరు ఆడిస్తూ వల్లిస్తాడు. అనంతపురం గురించి, అదివున్న యర్రగడ్డ గురించీ ఎవరైనా ఏకొంచెం ఆసక్తి చూపినా కునుకుతున్న కళ్లల్లోకి చెంగున పొంగివస్తుంది జీవం. అతని జ్ఞాపకాల్లోని ఒక్కో విషయం, అతని జీవితంలోని ఒక్కో ముక్క, యర్రగడ్డ చరిత్రలోని ఒక్కో భాగం. అందులో స్వేచ్ఛగా తిరిగిన కురవల జీవితాల్లోని విశేషాలు- తిరిగి జీవిస్తాయి. యర్రగడ్డ అతని తల్లి. ఆ భూవమ్మ బిడ్డ అతను. (ఈ అబ్రివ్యేషన్ గూడా సుశీలమ్మదే)

ఊరినిండా అతనికి తెలిసిన వాళ్లే! పనివదలి మధ్య మధ్య కనపడ్డ వాళ్లతో మాట్లాడడం అతని అలవాటు- ''మీ ఊరిమీద సినుకులుపడ్డయ్యా? వంకలు బారినయ్యా? సెరువుకి నీల్లు ఎన్ని మెట్లొచ్చినాయి?'' అంటూ ఎన్నో పరామర్శలు. (అయితే యివన్నీ వట్టి పనికి మాలిన విషయాలనుకుంటాడు గోపాలరావు)

గోపాలరావుకెందుకో లింగప్పపైన సదభిప్రాయం లేదు. అతడు లింగప్పను పనిలోనుంచి తీసేద్దామనుకునేసరికి సుశీలమ్మ అడ్డుపడింది. అపాటికే ఆమెకు లింగప్ప పట్ల ఆత్మీయత ఏర్పడిపోయింది. తన జీవితంలో తను అనుభవించలేనిదేదో లింగప్ప జీవితంలో వెదుక్కోసాగింది. ''లింగప్పలో ఏదో లయవున్నది. సజీవమైన భాష, దానికనుగుణంగా చేతుల కదిలిక, ముఖ భంగిమ- యీ అన్నిట్లోంచీ ప్రవహించే విషయం- ఆ విషయాన్ని జీవించిన లింగప్ప- లింగప్పా, అతని జీతమూ వేరే కానేకావు?

- ఒక పాట కచేరీలో బాలమురళీకృష్ణ 'ఎందరో మహానుభావులు' పాడగా ఆమె విన్నది. 'అతడు పాడుతున్నాడు. వింటున్నాడు. ఎందరో మహానుభావుల్ని తలచుకుని ఆనందిస్తున్నాడు... అక్కడ శ్రోతలు లేరు. తాను లేదు. అతనొక్కడే వున్నాడు... అతనూ లేడు. పులకిత శరీరులై, ఆనంద పయోధినిమగ్నులై, ముదంబునను యశంబుగనే వారే వున్నారు. వాళ్ళూ లేరు. ఒక తన్మయీ భావం, ఒక స్పందన మాత్రం వున్నది. అప్పుడామె కళ్లల్లోనుంచి ధారాపాతంగా నీళ్లు రాలిపోయాయి.

-లింగప్ప వట్టి వెర్రిబాగుల వాడని సుశీలమ్మకు తెలుసు. కానీ ఒక్కొక్కప్పుడు లింగప్ప మాటలు వింటుంటే ఆమెకెందుకో ఆనాటి అనుభవం గుర్తు కొస్తుంది.

తనకు జ్వరం వస్తే చికిత్స ఏమిటో అతడే చెప్పాలి- 'బాగా వుడుకు నీల్లల్లో తానం జేత్తా. రాగిముద్దలో గోగాకు వూరు బిండి పిసుక్కోని తిని, బాగా మజ్జిగ బోసుకుని తినేస్తా. జెరంగిరం యాటికి బోతదో? ఇంగో మందుపనిలే...'

అంతటితో వూరుకుంటాడా? కొనసాగిస్తాడు. 'మా కురవోల్లల్లో పొద్దునేమొగంగడిగినో డెవుడు? లేసేది, సద్దినేది, సేతులు గొర్రెలకు రుద్దేసి మూత్తుడుసుకుని పోతావుండేది. నీల్లు - నీల్లెక్కడ దొరుకుతై వనాంతరాల్లో దిరిగేవాల్లకి? వున్నప్పుడుంటై, లేనప్పుడుండవు. అందుకే మాకురవోళ్లు దప్పిని సంపేత్తారు. తొలీతే ఎక్కువ నీల్లు తాగరు. వున్నయ్యని ఇప్పుడు తాగితే, లేనప్పుడెట్లా?'' - అంటూ సుశీలమ్మనే ప్రశ్నిస్తాడు లింగప్ప.

అతి సామాన్యపు జీవితం. కాని అది చావు తాకలేని జీవితం. నిరంతరం ప్రవహించే జీవవాహిని. మృత్యువుగూడా జీవితంలో భాగమే లింగప్పకు. నాకు జీవితం గూడా మృత్యువులో భాగమే అనుకుంటుంది సుశీలమ్మ.

అనంతపురాని కొక వైపు హద్దుగావున్న పెద్ద చెరువును కొందరు బుక్కరాయ సముద్రం అంటారు. కానీ దేశంలో వాడుకేమో అనంతపురం చెరువనే. 'గుట్టపైన నిల్చుంటే ఒకవైపున చెరువు గుట్టల్ని ఒరుసుకుంటూ అలలు అలలుగా ఎగిసినదే అలవిగాని చైతన్యాన్ని యిముడ్చుకొంటున్న ఆనంద సాగరం. గట్టుకు రెండో వేపు చూపుమేరంతా పచ్చని పైర్లు. పైర్లనడుమ గుట్టలు. గుట్టల్లో గవులు, గవుల్లో మఠాలు. ఒక్కోదానికీ ఒక్కోచరిత్ర.

'పెనకసెర్లకాడ గందవుల్లయ్య కొండలో గెవిలోనివుమ్మకాయేత్తే ఈగెవిలో వుంతానికి దొర్లుకొత్తుందట'- అంటూ స్థానిక విశేషాలన్నీ సుశీలమ్మకు తెలియ జెప్పిన వాడు లింగప్పే చెరువు గట్టుమీద గణేశుడికి గుడి కట్టారు. చుట్టూ చెట్లు, కూర్చోడానికి రాతి అరుగులు. ఇకా ముందుకు వెళ్లి ఆకాశం క్రింద నుంచోడం సుశీలమ్మకు యిష్టం. అక్కడ ఆమె·మనసు విప్పారి, వికసించి చెరువులోని నీళ్లలాగా మహానందంలో సుళ్లు తిరుగుతుంది. ఆ ఆనందానికి ఆకాశమే అవధి. స్వేచ్ఛలోకి ఎదిగిన మనసును గణేశుడి ముందుంచి నమస్కరిస్తుంది - ఇంటికి తిరిగి వెళ్లేప్పుడు.

పట్నంలో గోపాలరావు ఒక కమర్షియల్ బ్యాంకు నడుపుతూ, బాగా సంపాదిస్తున్నాడు. బ్యాంకులో అప్పు తీసుకొని తిరిగి యివ్వకుండా ఎదురు తిరిగి మాట్లాడుతున్న కదిరి కాపుల మీద కోర్టులో కేసులు పెట్టి డిక్రీ తెచ్చుకున్నాడు. ఆసందర్భంలో ఒక రోజు సాయంకాలం గణేశుడి గుడిలో పూజా పునస్కారాలు ఏర్పాటుచేసి, అందుకోసం భార్యను బయల్దేరదీశాడు.

-పూజ అయ్యాక చెరువు గట్టు మీద కొంచెంసేపు కూర్చున్నారు. ఎనిమిది దాటింది. గుళ్లో జనంలేరు, పూజారి అలికిడి గూడా లేదు. ముష్టి వాళ్లూలేరు. చంద్రుడి వెన్నెల గుడ్డిగా వుంది. లేచి కారు దగ్గరకు బయల్దేరారు. చెట్టు క్రింద చీకట్లోనుంచీ ముగ్గురు మనుషులు వచ్చి చుట్టుముట్టారు. ఇద్దరు మనుషులు గోపాలరావు నోరు మూసేసి చెట్టుకి కట్టారు. మిగతా యిద్దరు సుశీలమ్మని పట్టుకుని నగలన్నీ ఒలిచేశారు. ఆమెను కిందికి తోసి చేతులూ, కాళ్లూ పట్టేశారు ఏవండీ అని కేకపెట్టి తన్నుకుంటున్న ఆమె నోట్లో గుడ్డలు కుక్కారు.... ఎవరూ ఆమెను రక్షించలేదు...

-హాస్పిటల్లో తెలివొచ్చింది. జరిగింది సరిగ్గా జ్ఞాపకం లేదు. పట్టరాని ఏడుపు. గుండెల్లో మంట. ఒళ్లంతా మంట. లోపలి మంటలో దేనికోసమో వెతుకులాట.
తనేమైంది? ఏం జరిగింది? ఆలోచిస్తుంటే బుర్ర బద్దలైపోయింది.

ఆసుపత్రి నుంచి డిస్ఛార్జి అయి యింటికొచ్చింది. మనుషుల చూపులు కాల్చేస్తున్నాయి. తట్టుకోలేకవెళ్లి బావిలో దూకింది. సమయానికెవరో రక్షించేశారు. మళ్లీ తెలివొచ్చేసరికి మంచంపైనే వుంది.

భర్త వైఖరిలోని తిరస్కార భావం ఆమె గుండెల్ని తొలిచేస్తోంది.

''ఛీ ఛీ. ఇంకెందుకీ బ్రతుకు?'' అని కుమిలిపోయింది.

ఒంటరిగా తనకు కాపలావున్న లింగప్పను పిలిచి 'ఎండ్రిన్‌గానీ ఏదైనా గుక్కెడు విషం తెచ్చి పెట్టగలవా?' అని ప్రాధేయపడింది.

-మనసులోంచీ వగతగా విన్న లింగప్ప గోడకు జారిగిలబడి తలగొక్కుంటూ 'పానం పోగొట్టుకోడం ఏందవమ్మా? ఎందరు జనాలు బతకడం లేదు. దేవుడు వెట్టినయ్యన్నీ అనుబగించాలిగదా' అన్నాడు.

- అత్తా, ఆడబిడ్డా వచ్చారు. కన్నీరు కార్చారు. 'ఆ ప్రాణం అప్పుడే పోయివుంటే ఎంత బాగుండేదో! ఏం పాపం చేసుకున్నావో, ఖర్మ' అంటూ ఈసడించుకున్నారు.

తల్లి వుంటే ఏమనేదో? పుణ్యాత్మురాలు ఎన్నడో పోయింది. నాన్నగారు, అన్నా, చెల్లెలూ వచ్చారు. తనకోసం బాధపడి ఏడ్చారు. కానీ తనను బ్రతికించగలమాట వాళ్ల దగ్గర లేదు.

నేను సుశీలను, నిప్పులాంటిదాన్ని. నన్నే మలినమూ అంటదు. అప్పటికీ యిప్పటికీ ఒకటిగానే వున్నాను అనుకుంటుందొకసారి. వెంటనే 'నా జీవితం నాశనమైపోయింది. నేను నశించిపోయాను' అనుకుంటుంది.

తన ఉనికిపట్ల తోడి మనుషుల ప్రతిస్పందనను చూస్తూ వచ్చిన కొద్దీ రెండో అభిప్రాయమే బలపడుతూ వచ్చింది.

మళ్లీ లింగప్ప ఒక్కడే దగ్గరగా తారట్లాడుతూ కనిపించాడు.

సుశీలమ్మ ఏడుస్తూ అడిగింది

''లింగప్పా! నాకేదైనా తెచ్చిపెట్టవా?''

లింగప్పగూడా ఆపాటికొక నిర్ణయానికొచ్చేశాడు.

- 'ఏందమ్మా; వూరికే సత్తానంటావు? ఈ ఊళ్లో వుండలేకపోతే మావోళ్లకాడికి కుంటి మద్దికి పంపిస్తా! అయిదరాబాదు నుంచి ఒచ్చినావని సెప్తా. నా కోడలి చుట్టం రాలివని యాదో చెప్పుకుంటా. నీకేల అదంతా. బతకడానికి సోటే లేదా?'

ఆ తరువాత సుశీలమ్మ జీవితం ఏమైందని ఈ వ్యాసకర్తను అడగకండి! 'గాలిరథం' అన్న కథల పుస్తకం సంపాదించి, అందులోని 'చెరువు దగ్గర...' అన్న కథ చదవండి. రచయిత్రి శ్రీమతి ఆర్. వసుంధరా దేవి.

ఎప్పుడు, ఎక్కడ ఏవిషయం చెప్పాలో, ఆ చెప్పేది ఎవరి వైపునుంచీ చెప్పించాలో, ఏయే పాత్రల నోట ఏయే నుడికారంతో మాట్లాడించాలో, ఎక్కడ కథనం పొడిగించాలో, ఎక్కడ సంగ్రహించాలో మొదలైన వివరాలకోసం చాలా జాగ్రత్తగా చదవవలసిన కథ. 'చెరువు దగ్గర...'. సుశీలమ్మ కథ అనే ఉత్తుంగపాద పీఠంపైన రచయిత్రి 'లింగప్ప' అనే విరాట్పురుషుణ్ణి నిల్పో బెట్టారు. రూపవర్ణన, స్థానిక వ్యావహారిక భాషనుంచి పుణికి పుచ్చుకున్న మాటలతీరు, వివిధ సందర్భాల్లో అతడి కదలిక, ప్రవర్తన - అప్పుడప్పుడూ అతడు వెలిబుచ్చుతూ వచ్చిన స్థానిక విశేషాలు, జీవితంపట్ల అతడికిగల దృక్పథం, మనసులోని ఆంతర్యం మొదలైన వస్తు సామగ్రితో, ఒక దేశానికి, కాలానికీ చెందిన వ్యక్తిని, మంచితనానికి ప్రతీకగా, ఒక మహోన్నత మానవతామూర్తిగా నిర్మించగలిగారు. చదువు, సంస్కారం, భోగం, భాగ్యం, డాబూ, దర్పం అంతా తమవే ననుకునే మిగిలిన నాగరిక మానవుల పాత్రలు ఎత్తులో ఆ మహాశిల్పం కాలిమడమల దగ్గర కైనా రావు.

సమాజ జీవనంలో స్త్రీ నిస్సహాయతను చిత్రించిన గొప్ప కథల్లో 'చెరువు దగ్గర...' ఒకటి. ఆ కథలోని గొప్ప పాత్ర 'లింగప్ప'? ◆

సమీక్షించదగిన వ్యాసం.

సమీక్ష

# కళలలో సెక్సు - నీతి

– కె.వి. రమణారెడ్డి

*(కనుపూరు వెంకట రమణారెడ్డిగారు నెల్లూరు జిల్లా రేబాల గ్రామంలో 1928 లో జన్మించారు. చరిత్రలో రాజనీతి శాస్త్రంలో M.A. పట్టం పొందారు. కావలి జవహర్ భారతిలో అధ్యాపకులు. విరసం కార్యదర్శి. ఎమర్జన్సీ కాలంలో 21 మాసాలు జైలులో ఉన్నారు.*

*అడవి, భువనఘోష, అంగారవల్లరి, ఎర్రపిడికిలి, జైలుకోకిల (కావ్యాలు), కవికోకిల, గురజాడ, తెలుగుజాడ, మహోదయం, శరత్‌బాబు (సాహిత్య విమర్శలు), అన్నపూర్ణ (నాటకం), రాజీవం, ఎండమావులు, పద్మవ్యూహం (నాటికలు), డిటెన్యూడైరీ – వీరి ముఖ్యరచనలు.)*

మొగ చన్నులు, చిగురు పెదవులు, అనటి తొడలు, మొలక మేనుగల ఇళాదేవిని ఎలా ఏలుకోవాలో దక్షిణ నాయకుడైన కృష్ణుడికి రాధ బోధిస్తున్నది వినండి:–

సీ. కొన నాల్కగొని మోవి చెనకి చూతువు గాని
యదరంటగా నొక్కి యానబోకు
ముద్దు చెక్కుల జిన్ని ముద్దులుంతువు గాని
జిగి గోటికత్తు జీరబోకు
మొనవేళ్ళ జనుమొనల్ పుడుకుదింతియ కాని
వగవగ బిగిపట్టు పట్టబోకు
రతికేళి మెల్లమెల్లన సల్పుదువు గాని
దురుసు పై రసములు నెరపబోకు
తే.గీ. వెఱ్ఱినై తెల్పెదనుగాని వెలది నీవు
వలపులను మించి గడిదేరి వద్దజేరి
మారుసాముల జలపోరి పోరువేళ
నాదు గురికట్లు నిలుచునా నలిన నయన. 1

నిజమే, నిలవలేదు. ''చౌశీతి బంధ గతుల బెనగి చాలక పురారతులగలసి'' ఇళా కృష్ణులు మార సంగ్రామ కేళిలో అలసి నిద్రించి ఉన్నప్పుడు మనస్సంతా బాధగా మారిన రాధ వచ్చి తలుపు తట్టి లేపుతుంది. ఇక రాధామాధవుల ''మాటసాము'' సరేసరి.

తే.గీ. మాయురే బొబ్బ హాయిరే మజ్జ భళిరె
కలిసి విరిశయ్య మత్తేభముల వితాన
నీడులేదని వలపుల తేడు పొగడ
నపుడు వారిర్వు రా కయ్యమందుకొనిరి. 2

కాసెలో చేయివేసి కదియదీసి ''యల్లందులకుజొచ్చి'' ''తొడ కంబముల నాని తోపు నూకుల నూని'' కృష్ణుడు చేయవలసినదంతా చేస్తాడు. రాధ ఏమంటున్నదో విందాం:–

గీ. బాగు బాగన గట్టిగా బని యొసంగ
నియ్యరా కృష్ణ నాకును నిమ్ముగాను.

కృష్ణుని జవాబు:

రీవి వయసున గుణమున నీవె పెద్ద
రయము రయమున గావింపు రతినిరాధ. 3

ఈ సుఖం ఆనందమే, ఎవరు కాదంటారు? ''ఆనందో బ్రహ్మ'' మంటే బ్రహ్మానందం ఈ సుఖానికి పర్యాయపదమేనా? అవునంటుంది ముద్దుపళని. ఆవరకే అవునన్నాడు అల్లసాని పెద్దన. సాని పేరును ఇంటి పేరులోనే నిలుపుకొన్నందు చేత కాకపోవచ్చుగాని, దేవవేశ్య అయిన వరూధిని వృత్తికి తగినట్లుగా, బ్రాహ్మణ ప్రవరుడైన ప్రవరుని ప్రాజదువును తన చిత్త వృత్తికి కూడా తగినట్లుగా మలిచి, ఇలా అనిపిస్తాడు:

శా. ఎందే డెందము కందళించు రహిచే నేకాగ్రతన్ నిర్వృతిన్
జెందున్ గుంభగత ప్రదీపకళికాశ్రీ దోప నెందెందుబో
కెందే నింద్రియముల్ సుఖంబు గను నా యింపే పరబ్రహ్మ. (4)

రత్యానందంలోనూ బ్రహ్మానందంలోనూ రక్తుడికీ భక్తుడికీ ఒకే విధమైన తన్మయత్వం ఉంది కాబట్టి ఇది అది అవుతున్నది. కానిద్దాం, తప్పేముంది? మైథునం ఆహార, నిద్రా, భయాదులలో చేరిన మూల జీవ లక్షణం, సహజాతం (instinct) కాబట్టి దానికి జీవితంలో ప్రముఖ స్థానమే ఉంది. కళలన్నీ జీవితానుకరణలే కాబట్టి మైథునం కళలలో ప్రముఖ స్థానం ఆక్రమించ వలసిందేనా? దానికి మరుగేమీ అక్కర్లేదా?

మిథున శృంగారం సర్వ జీవ కోటికీ సహజమైన చర్యకదా అని, మైథునాన్ని బటాబయలు చేస్తే మనిషిలోని పశు లక్షణం మేల్కొని మనస్సంతా ఆక్రమించగలదని నీతి వాదులంటారు.
''మనుష్య జీవితమందు రెండును (నీతి, రసము) సమానమైన విలువ గల తత్త్వములు. మఱియు పరస్పర సంబద్ధములు. ఒకటి యున్నచోట రెండవది యుండును; ఉండవలయును, రసమయమైన కళా ప్రపంచమున నీతిని మఱచి పోవలయుననియు తలచుకొన రాదనియు చేయు వాదము వివేచనా ఫలము కాదు...'' 5

''కాని కళా సంసారమున నీతి తెఱమఱుగు భార్యగా నుండి పనిచేయవలయునే కాని ముందు పడి మొగము జూపి త్రోసికొని రారాదు – అట్లయినచో కళ సొగసు చెడును.'' 6

దీనికి పూర్తిగా విరుద్ధమైన వాదం కట్టమంచి రామలింగారెడ్డి నుంచి వెలువడింది.

''కావ్యము, శిల్పము, నీతిశాస్త్రముగాదు; ధర్మశాస్త్రముగాదు. శిల్పము యొక్క యుత్కర్ష నికర్షముల నేర్పఱుపవలయునన్నగాని రచనా సంవిధానముల బట్టి నిరూపింపనగునేగాని, 'భగవద్గీత యంత పారిశుభ్ర్యమిందులో లేదు, రామానుజ భాష్యమువలె ముక్తిదాయకముగాదు' అని వాపోవుట నిర్నిమిత్త ప్రలాపము. తుదకు గోప్యముల బచ్చిగా వర్ణించినను నీతిశాస్త్రముల బట్టి ఖండించుట తెలివితక్కువ. మఱి రసభంగమా కాదా యనుటయే శిల్ప విమర్శనము యొక్క ఒక్క పరీక్ష. తక్కిన పరీక్షలిట యధిక ప్రసంగములు, ఆభాసములు.'' 7

రసము, శిల్పము వగైరాలకు కళలలో ఎంత ప్రాముఖ్యమున్నా, సంఘ సౌష్టవానికి ఉపకరించే నీతి దృష్టికి పూర్తిగా స్థానంలేదని కొట్టివెయ్యడం అనుచితమైన వైఖరి. ఇంగ్లాండు దేశంలో 19వ శతాబ్ది చివర వాల్టర్ పేటర్ లాంటి శుద్ధకళావాదులు, ఆస్కార్‌వైల్డ్‌లాంటి ఆనందవాదులు చేసిన కళా సిద్ధాంతాలూ, చూపిన నమూనాలూ, రామలింగారెడ్డి మనస్సును వశపరచుకొన్నాయి. అనంత కృష్ణశర్మగారు తమ సాంప్రదాయక దృక్పథాన్ని విడనాడకుండానే కొంత వెనులుబాటు చూపగలిగారు. లియో టాల్‌స్టాయి శుద్ధ నీతివాదానికీ పేటర్, వైల్డ్ వగైరాల శుద్ధకళానంద వాదానికీ ఇది మధ్యే మార్గం కాగలిగింది. తిక్కననుకూడా ''శృంగార'' రసచిత్రణ విషయంలో అధిక్షేపించిన పండిత అక్కిరాజు ఉమాకాన్త విద్యా శేఖరులుగానీ, యూరపులో ''క్షీణ'' సాహిత్య ధోరణులను చించి చెండాడబూనిన మేక్స్ నార్డో (Max Nardaux) గానీ వితండ నీతివాదాన్నే చేశారు గాని, కనీసం సంప్రదాయ వైఖరినైనా గౌరవించలేదు.

''శృంగార ఏవ మధురః వరప్రహ్లాదనో రసః''– శృంగారం ఒక్కటే మధురం, ఆనందజనకం అయిన రసం అని ఆనందవర్ధనుడు, ''శృంగార ఏవ ఏకో రసః'' – శృంగారం ఒక్కటే రసం అని భోజుడు అన్నారు. శృంగార రస విశిష్టతను కళాపరంగానే వాళ్ళిద్దరూ దర్శించినట్లుంది. లోకదృష్టితో చూసినప్పుడు, శృంగారమే లోకయాత్రకు మూలంగా కనిపిస్తుంది. సంసార సాధనం కాబట్టి సంభోగం

గౌరవానికి నోచుకొంటున్నది. అయితే కళలలో దీన్ని చిత్రించేటప్పుడు, శృంగార రసం ఉత్తమ నాయకులను ఆశ్రయించుకొని ఉండాలని, ధర్మబద్ధమై ఉండాలని ఆలంకారికులు కూడా గుర్తించారు. అలా కానప్పుడు, అది క్షుద్రశృంగారమౌతుందని చెప్పారు. 8

ఆలంకారికులైతే చెప్పారు గాని, కవులు మాత్రం స్వతంత్రించి పోయారు. ఉత్తమ నాయకులు కూడా అధమ శృంగారాన్ని చూపెట్టడం మన తెలుగు సాహిత్యంలో క్షుద్రప్రబంధ కవులకే గాక, మహామహా కవులకు కూడా పరిపాటి అయింది. ఉహరణలు చూపడం వృధా పరిశ్రమ. ఈ తెగులు శ్రీనాథుడికే (స్త్రీ నాథుడట!) గాక (9) నాచనసోముడికీ (10) ప్రబంధకవి అనిపించుకొన్న ప్రతివాడికీ సోకింది. శృంగారం హద్దు మీరింది. కొక్కోకశాస్త్రానికి వ్యాఖ్యానం అక్కర్లేకుండా పోయింది. కావ్యనాయకుడు తప్పనిసరిగా పడకటింటి పెండ్లికొడుకయ్యాడు - అంతేకాదు, పెండ్లి కుమార్తెను కళ్ళతో బట్టలొలిచి చూశాడు. ఉదాహరణకు, ఔచితిని పోషించగలడని నమ్మదగిన పింగళి సూరననే తీసుకుందాం. నాయకుడైన కళాపూర్ణుడు అక్షరాలా పెళ్ళికొడుకై వచ్చి శయనాగారంలో కూర్చుని మధుర లాలస కోసం ఎదురు చూస్తున్నాడు. చెలికత్తెలు ముందుకు తోయగా నాయిక సిగ్గుతో నడవలేక నడిచివస్తున్నది. గవాక్షంనుంచి నాయకుడు తన భార్యను చూస్తున్నాడు. ఆ చూపులు మామూలు చూపులుకావు - 'ఎక్స్‌రే' చూపులు...''తద్రూపలావణ్య విలాసంబు నిరీక్షింపుచు నచ్చెరువంది యాపాదమస్తకంబు గ్రమంబునంబరికింపుచు...'' ఫాలంనుండి పాదం వరకు ఒక్కొక్క అవయవానికి ఒక్కొక్క పద్యం చొప్పున 16 పద్యాల మేరకు ''తన మనంబున'' వర్ణించు కొన్నాడు. (11) తర్వాతి విషయం సరేసరి.

ఆల్బర్టో మొరేవియా The Woman of Rome లోని నాయికకూ, ఈ రాచబిడ్డలకూ ఆటే తేడాలేదు - అందరూ వలరాచ బిడ్డలే. అయితే ప్రబంధయుగం సాంఘికంగా రాజరిక, భూస్వామిక యుగం. పురుషాధిక్యమే ''రసికత'' అనే పేరుతో స్త్రీని వట్టి భోగవస్తువుగా, రతిని జీవిత పరమావధిగా ఎంచింది. హిందువులకొక్కరికే ఇది వ్యాధిగా పరిణమించినట్లు నీరద్ చౌదురి రాశాడు. (12) ''నరాః వై శిశ్నోదర పరాయణాః'' అనే సంస్కృత సూక్తిని ఉదహరిస్తూ, ఆదిలో వైదిక యుగం మొదలు ఐతిహాసిక యుగం వరకు ఆర్యులు చాలా అమాయకంగా శృంగార విషయాలను నిస్సిగ్గుగానే చూసేవాళ్ళంటాడు. అటు తర్వాతి కాలంలో మనుషులు దుర్బలులూ చేవచచ్చినవాళ్ళూ అయేకొద్దీకీ, విషయ సుఖాలమీద విపరీతమైన వ్యామోహం ప్రబలిందంటాడు. శమదమాదుల్లో కనిపించేది నిజానికి ఈ వ్యామొహాన్ని మరోదారి పట్టించడమే. సౌఖ్యాన్ని శారీరకంగా తప్ప ఊహించలేక, భర్తృహరిలా వైరాగ్యంలో కూడా యోగులకు అనుచితమైన విధంగా వెనుకటి సాంసారిక సౌఖ్యాలను నెమరు వేసుకోవడం, తృష్ణను జయించలేక పోవడమే.

ధరణి విశాల తల్ప, ముపధానము బాహువు, నింగిచందువా,
సురటులు గంధవాహములు, శోభనదీపము చందురుండుగా,
విరతి వధూమణిం గలసి, వేడుక మీర సుఖించి, శాంతుడై
నిరుపమలీల యోగిశయనించు, మహీపతిమౌళి కైవడిన్. 13

పోనుపోను, ఈ మిథున సంబంధం సాంఘిక విషయంగాగాక, వట్టి శారీరక విషయంగా ఎంచే స్థితి వచ్చింది. జాతి దేహ దారుఢ్యం తగ్గేకొద్దికీ, మానసిక దౌర్బల్యం ఎక్కువైంది. కళగానే ఉండిపోకుండా, కామం ఒక శాస్త్రాన్నే అపేక్షించింది. వాత్స్యాయనుడి 'కామసూత్రం' అయినా ఫర్వాలేదు, కొక్కోక శాస్త్రం రతిని పశుధర్మంగానే గాక పశుచేష్టగా కూడా ఆదరించింది. వివాహబంధం దాస్యబంధమయేకొద్దికీ, రకరకాల బంధాలకు గుర్తింపు వచ్చింది. వీటన్నిటికీ కేంద్రం, పరిశోధనాగారం

స్త్రీ–భార్యగాక స్వైరిణి, అదీచాలక వేశ్య. పరకీయా శృంగారమే ప్రబలింది. రాగం అనేది రోగం కాగా, వైరాగ్యం, అచ్ఛాదీతనం, ధర్మోపన్యాసాలు వగైరా ఆ రోగికి మేలిముసుగయ్యాయి. ఈ క్షుద్రత మతంలోకి చొరబారింది. దేవుళ్లు బహుపత్నీకులేగాక రసికులు కూడా అయ్యారు. ఖజూరహో, కోణార్కవంటి దేవాలయాల్లో బూతుబొమ్మలు ప్రత్యక్షం. శృంగారం సహజభావం, ప్రజోత్పత్తి కారణం కావలసింది, ఇలా ఇంద్రియ సంతర్పణ సాధనంగా పరిణమించింది. కామసూత్రం, ఖజూరహో, కోణార్క – మూడు 'కె'లుగా ఈనాడు 'స్వేచ్ఛా' ప్రియులైన పాశ్చాత్యులను ఆకర్షిస్తూన్న విషయాలు – హైందవ భూస్వామ్య వ్యవస్థ చెడే కాలానికి పుట్టిన కుక్కమూతి పిందెలు. అయినా కళా విషయాలుగా కూడా వాటిని తిరస్కరించడం తెలివి తక్కువ. అలంకరణకు నిర్దేశింపబడినవే గాని ఇవి నైతికోపదేశానికీ అవినీతి ప్రచారానికీ నిర్దేశింపబడినవి కావని, వాటికి మతసంబంధమైన ప్రాముఖ్యంలేదని అంటూనే, తాంత్రిక మతంలో మాత్రం నగ్నదేవతా ప్రతిమలకు ఆ ప్రాముఖ్యం ఉన్నట్లు నీరద్ చౌదురి రాస్తాడు. (14)

## 2

ఈ భూస్వామ్య వ్యవస్థ తర్వాత పాశ్చాత్య సంఘంలో తలెత్తిన ధనస్వామ్య వ్యవస్థ తన ప్రారంభ కాలంలో అభ్యుదయకర సాంఘిక వైఖరులను అవలంబించింది. ముఖ్యంగా వ్యక్తి స్వాతంత్ర్యం పేరిట పాత కుటుంబ సంబంధాలను తెగదెంచింది. అయితే స్వార్థాన్ని పరమార్థం జేసింది కూడా. స్త్రీ పురుష బాంధవ్యంలో ''ప్రేమ'' భావం దూరిరావడానికి తోడ్పడినట్లుగానే, స్త్రీకి వ్యక్తిగా ప్రత్యేకత కలగడానికి కూడా ఈ కొత్త భావజాలం తోడ్పడింది. నిన్న మొన్నటివరకు పురుషులతో సమానంగా అమెరికన్ స్త్రీలకు గూడా చట్ట సంబంధమైన ప్రతిపత్తి కలగలేదు; స్విస్ స్త్రీలకు రాజకీయ హక్కు చేకూరలేదు. అయినా భూస్వామ్య సమాజంలోని స్త్రీతో పోలిస్తే, ధనస్వామ్య సమాజంలోని స్త్రీ పురుష దాస్యం నుంచి ఒక మెట్టు పైకెక్కి వచ్చింది. దాసి ప్రేయసి అయింది. వివాహ బంధం యావజ్జీవ నిర్బంధం కాకుండా పోయింది. కావచ్చుగాని, ధనస్వామ్య సమాజంలో ప్రతిదీ రూపాయణాల వ్యవహారమయింది. cash Nexus (డబ్బులంకె) అనేది ఒక్కటే మానవ సంబంధాలకు ఏకైక సూత్రమయింది.

మార్క్సు, ఎంగెల్సు మాటల్లో– ''బూర్జువా వర్గందిపైచేయి అయినచోటల్లా అది సకల ఫ్యూడల్ సంబంధాలనూ, సకల పితృస్వామిక సంబంధాలనూ, సకల నిష్కపట జానపద సంబంధాలనూ నిర్మూలించింది. మానవుని 'జన్మతః తనకంటె అధికులైన వాళ్ళకు' ముడివేసిన కలగాపులగపు ఫ్యూడల్ సంబంధాలను బూర్జువా వర్గం నిర్దయగా పటాపంచలు చేసి, మనిషికీ మనిషికీ మధ్య నగ్నమైన స్వలాభంతప్ప, కిరాతకమైన డబ్బు లావాదేవీ తప్ప యిక యేసంబంధాన్నీ మిగలనివ్వలేదు అది మనిషి విలువను రూపాయల్లోకి మార్చింది...

''బూర్జువావర్గం కుటుంబ వ్యవస్థమీద మమకారాల మేలిముసుగును లాగిపారవేసి, కుటుంబ సంబంధాలను కేవలం ఆర్థిక సంబంధాలుగా దిగజార్చింది.'' 15

కళలో ప్రతిబింబించేవి సాంఘిక సంబంధాలే. కాని, బూర్జువా సమాజం ఆస్తి సంబంధానికే ప్రాముఖ్యం ఇచ్చింది. ఆస్తి సంబంధమనేది మనిషికీ మనిషికీ ఉన్న సంబంధంకాదు, మనిషికీ వస్తువుకీ మధ్యగల సంబంధమే. అయినా ఇది ఒక భ్రమ మాత్రమే నంటాడు క్రిస్టోఫర్ కాడ్వెల్. అజ్ఞాతం, అరాజకం అయిపోయిన మానవ సంబంధాలకు ఆస్తి సంబంధం ఒక మారువేషమే. దీని అడుగున ఉండేదల్లా పీడకుడికీ పీడితుడికీ మధ్యగల సంబంధమే. (16) అన్ని వృత్తులకు మల్లేనే, సాహిత్యవృత్తి కూడా బూర్జువావర్గానికి ఊడిగం చెయ్యవలసి వచ్చింది. కళ వ్యాపారవస్తువుగా మారింది. వ్యక్తి

అనుభవం కళకు చోదకశక్తి అయినట్టే వస్తువు కూడా అయింది. సాంఘిక ప్రమేయం స్థానే వైయక్తిక ప్రమేయం కళాసర్వస్వంగా మారింది. వైయక్తికమైపోయిన అభిరుచులకూ సాంఘికవాతావరణానికి మధ్య జరిగే సంఘర్షణనుంచి, రూపానికీ వస్తువుకీ మధ్య జరిగే సంఘర్షణనుంచి, కొత్తకళ పుట్టుకొస్తుంది. కళాకారుడు, మంచికళాకారుడు, అవశ్యం తనకళకు సంబంధించిన విషయాలకుగూడా తనమనస్సును అర్పించుకోవలసి వస్తుంది. విప్లవాత్మకదశలో కళ ఇలా ప్రయోజనాత్మకం, సందేశం భరితంకాక తప్పదంటాడు కాడ్వెల్.

బూర్జువా సమాజం తొలిదశలో మిధునశృంగారం వ్యక్తి స్వేచ్ఛావాదంతో కలిసినందువల్ల గాఢోద్రేకభరితం (Passionate Love) కాగలిగింది. ఫ్యూడల్ సంస్కృతిలోని ఉదాత్త కాల్పనిక ప్రేమభావం (romantic love) ప్రాచీన గ్రీక్ సంస్కృతిలోని ఇంద్రియానందభావం (sensual love) ఈ బూర్జువా ప్రేమభావంలో సంగమించినట్లు మరొక వ్యాసంలో కాడ్వెల్ పేర్కొన్నాడు 17. అయితే ఇది ఎంతో కాలం నిలువలేదు. పారిశ్రామిక పెట్టుబడీదారీ వ్యవస్థ ఏర్పడ్డాక, ఆధునిక బూర్జువా రాజ్యం రూపొందాక, సాంఘికసంబంధాలలో ఇంకా నిలిచిఉన్న మార్దవం ఎండిపోయినట్టే మిథునశృంగారభావం కూడా ఎండిపోయింది. ఒక్కొక్కరేకూ వాడిరాలిపోయే పువ్వులాంటిదయింది. భార్య ఆస్తిలో భాగమైంది. ఆస్తి కాబట్టి అది యావజ్జీవం గులాములా తనకు అంటిపెట్టుకొని ఉండాలి. వివాహం, సంసారం, శృంగారం, సంతోషం – ఇవన్నీ ఇలా వ్యక్తి స్వార్థరూపమైన ఆస్తిభావానికి లోబడిపోగా, బూర్జువా సాంఘిక సంబంధాలు అమానుషంకాక తప్పలేదు.

కళలలో, ముఖ్యంగా సాహిత్యంలో, తలెత్తిన కాల్పనికవాదం (Romanticism) నిజజీవితంలో మరుగుపడి కరువైపోయిన ప్రేమను ఊహలో, కోరికలో జీవిత సర్వస్వంగా భావించింది. కాల్పనికవాదం బూర్జువా సంస్కృతి మీదలేచిన మొదటి తిరుగుబాటు. అయితే దానిచూపు వెనక్కి సాగిందికాని ముందుకు కాదు. వెనుకటి రోజుల్లో లోకం అందంగా, అచ్చంగా ఆనందమయంగా ఉండేదో లేదోగాని, కాల్పనిక కళలో ఉండగలిగింది. పాతగొప్పలు చెప్పుకోవడమో పాతరోజులు నెమరువేసుకోవడమో, లేక వర్తమాన సమాజంలోని యాంత్రికతను నిరసించడమో ఐచ్ఛికానందాన్ని అభిలషించడమో, కాల్పనిక కళాకారులకు రివాజైపోయింది. కొందరు ఇంకా భీష్మించుకొని వైజ్ఞానిక ప్రగతిని కూడా అసహ్యించుకొన్నారు. సమకాలంతో స్పర్థించారు. సంఘంనుంచి వెలివేసుకొన్నారు. తమ అనుభూతి యేమో, తామేమో! ''లోకముతో మనకేటికి లోలాక్షి రా పోదాము'' అనే వైఖరీ, ''దిగిరాను దిగిరాను దివినుండి భువికి'' అనే మొండితనమూ, కాల్పానికోద్యమ భావాలే. కళాకారుడు తన వ్యక్తిస్వేచ్ఛను వితండవ్యక్తివాదంగా మార్చుకొన్నాడు. ''తన కళ్యాణము స్వర్గము'' అనేట్లుగా, సంఘానుభవంనుండి దూరమైన స్వీయానుభూతికి పట్టంకట్టాడు. తన ప్రేమ, తనవిరహం, ఇంతే తన కళాలోకం సమస్తం! అందులోకి తానూ తనప్రియురాలూ తప్ప తదితరులకు ప్రవేశం లేకుండాపోయింది. కళాకారుడికి సౌఖ్యదాహం పట్టుకొంది. బైరన్‌లోలాగా అది ఒకనాటికి తీరేదాహం కాదు. ఒక సౌఖ్యానుభవం వెనువెంటనే మరొకటి, దాని వెనువెంటనే ఇంకొకటి. ప్రేమ మంత్రమైంది, తపస్సైంది, మోక్షపదవి అయింది. సౌందర్యం స్త్రీకి ఆదర్శస్వరూపమైంది. సాఘికవాస్తవం కళనుంచి నిష్క్రమించింది. కళ కళకోసమే అనేవాదం తలెత్తేనాటికి కాల్పనికవాదం వెర్రితలలు వెయ్యసాగింది. ఆనాటికి బూర్జువా సమాజం కళను వట్టి అంగడి దినుసుగా మార్చివేసింది కాబట్టే కళాకారుడిలా తన నిరసనను ప్రకటించవలసి వచ్చింది. ఈ నిరసనలకు వ్యక్తి కేంద్ర బిందువయ్యాడు. కాలంతో, దేశంతో పొసగక, అతడు తన అంతరాంతరాల్లోకి వెళ్ళిపోతున్నాడు. తనవ్యక్తావ్యక్తమైన భావప్రపంచానికే అంకితమౌతున్నాడు.

మనస్తత్వశాస్త్రమంటూ ఒకటి ఫ్రాయిడ్ మూలంగా ఇలా లోకంమీదికి వచ్చి పడింది. ఫ్రాయిడ్ దృష్టిలో ఏ వ్యక్తికి అవ్యక్తి ఒక సూక్ష్మప్రపంచం. వ్యక్తిమనస్సు అగాధంవంటిది. మనిషికూడా జంతువే కాబట్టి జంతుసహజమైన ప్రవృత్తులూ, ఉద్రేకాలూ, అక్కరలూ మనస్సులో ఎక్కువ జాగాను ఆక్రమించుకొని ఉండి, పైకినెట్టుకొని వచ్చి చర్యలరూపంలో బయల్పడుతాయి. మిథునప్రేమ (లిబిడో) వీటన్నిటికీ కీలకం. మనిషి అహం (ఈగో) తృప్తి చెందడానికి మైథునం అవసరం. అది మిథున ప్రేమకు పరమాశయం. ప్రేమ ఇతర రూపాలలోకూడా ఉండవచ్చునేమోగాని, తన ఆదిమస్వభావాన్ని అదిపూర్తిగా పోగొట్టుకోదు. తల్లిపాలకోసం ఎగబడే పసిపాప మొదలు చావుకోరుకొనే ముదుసలివరకు, మనిషి అన్న ప్రతిఒక్కడూ అన్ని జీవితదశలలోనూ, అన్ని చర్యలలోనూ, ఈ జంతుస్వభావానికే లోబడి ఉంటాడు. శృంగారం (ఈరోస్) కూడా స్వార్థాన్నీ దురాశనీ మీరదు. మీరినట్లు కనిపించడం అంతా, మైథున ఆశయం నెరవేరక ప్రక్కకుమళ్ళి మరొక రూపాన్ని ధరించడం మాత్రమే. 18

ఫ్రాయిడ్ సిద్ధాంతంలో వ్యక్తిచైతన్యం స్వయంభువులాంటిదేగాని సంఘసృష్టి కాలేదు. సంఘప్రభావాలను ఏ మేరకు నిరోధిస్తే ఆమేరకు వ్యక్తి స్వతంత్రుడైనట్టు! శిశ్నోదరాలు రెండింటిలో ఉదరాన్ని విస్మరించినట్టే, లేదా తక్కువస్థాన మిచ్చినట్టే, ఆహార నిద్రా భయ మైథునాలలో మొదటి మూడింటికంటె చివరిదానికే పెద్దపీట వెయ్యడం జరిగింది. సాంఘికశాస్త్ర సహాయంలేకుండా మనస్తత్వశాస్త్రం పరిపూర్ణత చెందజాలదనే విషయాన్ని సరిగా గమనించనందువల్లనే, అరాజకమైన ఉద్రేకాల పోటాపోటీలలో బూర్జువా వ్యక్తిత్వం భౌతిక ప్రపంచంలోని పోటీల్లోలాగా యుద్ధరంగమై, శిథిలప్రాయమై, చివరకు ఆత్మవినాశకరం కావడాన్ని ఫ్రాయిడ్ సిద్ధాంతం సూచిస్తుంది

3

పది నీతులు పది బూతులు
పది శృంగారములు గల్గి పద్యములు సభన్
జదివినవాడే యధికుడు
గదరప్పా కుందవరపు కవి చౌడప్పా

నీతులకేమి యొకించుక
బూతాడక దొరకు నవ్వు బుట్టదు ధరలో
నీతులు బూతులు లోక
ఖ్యాతులురా కుందవరపు కవి చౌడప్పా

మట్ల అనంతభూపాలుడైనా, తంజావూరి రఘునాథరాయలైనా, దొరదొరేకాబట్టి తన ''రాసిక్యం'' నిరూపించుకోవడానికి కవులకు ఒకొకప్పుడు నీతుల్లోకూడా బూతులు చొప్పించే పనిబెట్టారు. రాచరికం అంతరించాకగూడా, పరిస్థితి మెరుగెక్కలేదు. పైగా కళ ఒక వ్యాపారమైంది, వ్యాపారం ఒక కళ అయింది; కళావ్యాపారం, వ్యాపార కళ అవతరించాయి. అంగడిలో సరుకు కొనుగోలుదారుడికి నచ్చాలంటే, వాడి అభిరుచుల్ని అది తృప్తిపరచగలగాలి. ప్రజారంజకం కావడానికి ఆధునిక బూర్జువాకళ తనను తానే న్యూనపరచుకొని క్షుద్రవ్యవహారంగా మారుతూంది. గుడిచేటి (దేవదాసి) బజారుముండ అయినట్టుగానే, కళ బజారువస్తువు కావలసివచ్చింది. ప్రజల అభిరుచిని సంస్కరించి ఉన్నతం చేసేందుకు మారుగా తన ప్రమాణాలను ప్రజల అభిరుచిస్థాయికి దించి వేసుకొంటూంది. బూర్జువా సమాజంలాగే బూర్జువా కళ కూడా ధనదాస్యానికి లోబడి వెలయాలుగా మారింది.

శృంగారం పేరుతో కాముక కాముకీ వ్యాపారాన్ని సాహిత్యంలోనూ తదితర కళలలోనూ భూస్వామ్యయుగం మన సంస్కృతిలో అంతర్భాగం చేసిపోయింది. కురుగంటి సీతారామయ్య గమనించి చెప్పినట్టు, క్రైస్తవ మిషనరీల నీతివాద వైఖరి మన సాహిత్య విమర్శకులచేత ప్రబంధ సాహిత్యాన్ని, ముఖ్యంగా ''శృంగార'' సాహిత్యాన్ని రోయించుకునేటట్లు చేసింది. ఇలాంటి విమర్శకు చెంచయ్య, భుజంగరావుల కంటె ముందుగా వీరేశలింగం అంకురార్పణ చేసినట్లు నేలటూరు

వెంకటరమణయ్యగారు ఆరోపించారు. (19) ఇది చారిత్రకంగా వాస్తవమే. కాని నీతిబాహ్యమైన వైఖరిలాగే నీతియుతమైన వైఖరీ దిగుమతి చేసుకోక తప్పని దినుసు కాదు. బ్రాహ్మ సామాజికుడు కాకముందు వీరేశలింగం తన రచనలలో ఏ వైఖరి అవలంబించిందీ తెలుసుకోవాలి. బ్రహ్మ సమాజంలో చేరాక గూడా, సంఘ సంస్కరణ పరాయణమైన ప్రహసన వాఙ్మయాన్ని సృష్టించి దేశం మీదికి విడిచి పెడుతున్న దశలో కూడా, వీరేశలింగం పరకీయాశృంగార భావాన్ని విడనాడాడు కాదని గురజాడ అప్పారావు తప్పెన్నాడు. ''రంకు పురాణములు'' అనే మాటలకు వీరేశలింగం రచనల నుంచే నిదర్శనలు చూపాడు.

''పచ్చి శృంగారము రెండు రీతులుగా నుండును. రత్యాది వర్ణనమును, స్త్రీల అవయవములను వర్ణించుటయు నందొకటి. నిజమయిన పచ్చి శృంగార మన్నది పరకీయ శృంగారము. 20

శుద్ధాంధ్ర నిరోష్ఠ్య నిర్వచన నైషధములో ఒక పద్యాన్ని, అభాగ్యోపాఖ్యానము, రసికజన మనోరంజనములలో కొన్ని పద్యాలను ఎత్తిచూపి, ఇలా వ్యాసాన్ని ముగించాడు.

''ఇట్టి గ్రంథ రచన లోకమునకు హానిచేయును. దీనిని నిలుపవలయునని మా మతము.'' 21

ఆ రోజుల్లో ''శృంగార'' కావ్యాలపట్ల బ్రిటిష్ ప్రభుత్వం పెడమొగం పెట్టింది. నిషేధించింది కూడా. దానితో ప్రచురణకర్తలకు గంగవెర్రులెత్తింది. వాళ్లలో ముఖ్యులైన వావిళ్ళ వెంకటేశ్వర శాస్త్రి గురజాడ అప్పారావును ఆశ్రయించాడు. అప్పారావుకు పై వుద్యోగుల వద్ద పలుకుబడి ఉండేది. మద్రాసులో ''పండితులు'' కలిసిపెట్టిన సభలో అప్పారావు పాల్గొన్నాడు. ఈ విషయంలో గిడుగు రామమూర్తి నీతి వైఖరిని అవలంబిస్తే అప్పారావు కాస్త వెసులు బాటు చూపాడు. ఏ పుస్తకంలో నుంచి గాని పది బంతులు తీసి వాటిని ''పచ్చి'' శృంగారంగా ఎంచడం ''అల్ప దృష్టి'' అన్నాడు. యూరోపియన్ సాహిత్యంలోనూ అలాంటివి అగణ్యంగానే కనిపిస్తాయి. బొకాషియో, చాసర్, మార్లో, షేక్స్పియర్ లాంటి మహాకవులే ఈ ''దోషం'' నుంచి బయటపడలేదు. అంగాంగవర్ణనమే పాపమైతే, మైథునవర్ణనమే అపరాధమైతే, చుంబనాలింగనాదులు నేరమైతే, పాశ్చాత్య కవులూ కళాకారులూ మినహాయింపు కారు, అని అప్పారావు భావించాడు. ఆంధ్ర పండిత సభ అశ్లీలాలను దోషాలుగా ఎంచుతూనే, ''ఇంచుక నొక్కి'' వర్ణించినపట్ల ''పండితైక వేద్యమగు ప్రౌఢభాష'' ఉపయోగించబట్టి ఈ గ్రంథాలను ప్రజాసామాన్యం బోధపరచుకోలేరు గనక చెడిపోయే సమస్యలేదంటూ ఒక తీర్మానం చేసింది; ''కాబట్టి పూర్వకవి కృత శృంగార ప్రబంధములు రూపుమాపుటగాని యందలి భాగములను లోపింపజేయుటగాని కూడదని యీ సభవారి దృఢాభిప్రాయము.'' 22

మరో తొమ్మిది పదేళ్ళకు, 1923లో, మచిలీపట్నం నుండి వెలువడిన ''శారద'' పత్రిక అట్టమీదిబొమ్మ 'అసభ్యం' (obscene) గా ఉంది కాబట్టి దాన్ని అచ్చువేస్తే పత్రికను వెలువడనిచ్చేది లేదంటూ మద్రాసు సర్కిల్‌పోస్టుమాస్టరు – జనరలు ఒక తాఖీదు పంపాడు.

**The title page conveys an expression of not mere nudity but an exaggerated grossness which cannot come within the purview of true art at all.**

కళావిమర్శకుడుగా మారిన పోస్టుమాస్టరు – జనరలును ఆక్షేపిస్తూ కజిన్స్ ఒక ఉత్తరం రాశాడు. ప్రమోద్‌కుమార్ చటర్జీ సరస్వతీదేవికి చేసిన రూపకల్పనలో, నడుము పైభాగమంతా నీలవర్ణంలో ఆచ్ఛాదనమేదీ లేనట్లు చిత్రించడం జరిగింది; దేవి కలువపై కూర్చునిఉంది; వెనుకభాగంలో నీలాకాశం. అందులో తెల్లమబ్బులు ఉన్నాయి; రేఖలు బలంగా ఉన్నాయి. రంగులు మందంగా ఉన్నాయి; చిత్రం హిందూమతానికి, అజంతా చిత్రసంప్రదాయానికీ, బెంగాలీ చిత్రకళాపద్ధతులకూ అనుగుణంగా ఉంది. మరి ఇది ఎలా 'అసభ్యం', 'అవినీతికరం' అయినట్టు?

The objection is grounded partly on the nudity of the figure; but the consistent application of this test of art would close the art schools and galleries and museums of the western world as well as the sculptured temples of India and bring the world's master in painting and sculpture under the censorship of the Post Master - General of Madras.

స్తనాలుమాత్రం మరుగులేకుండా ఉన్నాయి. ఉంటే? ఉండినంత మాత్రాన కామప్రకోపం కలగవలసిందేనా : పురుషదేహలక్షణాలకు భిన్నంగా స్త్రీదేహ లక్షణాలను చూపడానికి భారతీయ చిత్రకారులు ఈ సంప్రదాయక పద్ధతిని పాటిస్తున్నారు. దేవతామూర్తులైనా, మానవమూర్తులైనా, ఈ సంప్రదాయానికి నిబద్ధమైనవే. 23

శుద్ధనీతి దృష్టి ప్రజాక్షేమం పేరుతో మంచికళకుగూడా ఎలా అన్యాయం చెయ్యగలదో చూపడానికే ఈ ఉదంతాన్ని వివరంగా వర్ణించాను. ఇలాంటి ఉదంతాలు వేనవేలు. డి.హెచ్. లారెన్సులాంటి గొప్పరచయిత కూడా ఇలాంటి నేరారోపణనుంచి తప్పుకోలేకపోయాడు. అతని Lady Chatterly's lover ఈ విధంగానైనా ప్రఖ్యాతి పొందింది. అయితే నిజంగానే నీచమైన అభిరుచులను రెచ్చగొట్టే క్షుద్రకళ కూడా తప్పించుకోవడానికి వీల్లేదు.

తెలుగుదేశంలో మేధావంతులనబడేవాళ్లు ఇప్పటికీ (1972లో వ్రాసినది) అచ్చాడీలుగా ఉండిపోవడమే విచారకమైన విషయం. ఔచిత్యదృష్టితో ''ప్రపంచ యోనిద్వారం'' లాంటిమాటలను విమర్శించడం ఒకెత్తు; నీతిదృష్టితో ఈసడించడం మరోయెత్తు. ఈ రెండవదే సంకటమైంది. ''ప్రౌఢభాష'' పండితైకవేద్యం కాబట్టి ఆ ముసుగులో ఎంత బూతుదాగి ఉన్నా ఫరవాలేదు లెమ్మనుకొనే మనస్తత్వం లోకవంచనా పరాయణమైనది. శివుడి మేఢ్రాన్ని భూమ్యాకాశాలనిండుగా నిగిడింపజేస్తే శ్రీనాథుడు రసికుడనిపించుకొన్నాడుగాని,

''భూగోళాన్ని శిశ్న శిఖరాగ్రం మీద నెలబట్టాను'' 24

అని మహాస్వప్న అనగానే బూతుకవి అనిపించుకొన్నాడు. నిజానికి నీతిరచయితల బూతుగ్రంథాలకంటె బూతురచయితల నీతిగ్రంథాలే మేలు. ఎందుకంటె, దిగంబర కవులుగానీ, సి. విజయలక్ష్మిగానీ వాడిన బూతుమాటలు బూతుమనస్సుతో గాక నీతి మనస్సుతో రాసినవి. బూతును నీతిగా చలామణీచేస్తున్న వ్యవస్థమీద వాళ్లు విరుచుకుపడ్డారు. లమ్డీకొడుకులూ, కాకారాయుళ్లూ, లంజాకొడుకులూ, కొజ్జాలూ, తమబూతునే లోకనీతి చేసుకోగోరుతున్నప్పుడు, శ్రీశ్రీ అన్నట్టు, ''దొంగ లంజకొడుకు లసలే మెసలే లోకంలో'' ఈ కోపోద్రిక్త కవులు ''ఉన్నదున్నట్లు'' చెప్పడానికిగాను తిట్లూ బూతులూ వాడారు. మర్యాదలూ, మప్పితాలూ,. ముసుగుచాటు వ్యవహారాలూ వీళ్లకు సరిపడలేదు. దేవుళ్లనూ నాయకుళ్లనూ నిలదీశారు. కడిగేశారు. దేశంకోసం ఆక్రోశించారు. ఆర్. రామచంద్రారెడ్డి గారు గానీ, ఆర్.యస్. సుదర్శనం గారు గానీ ఈ కొత్తరకం కవులలోని బూతునే గ్రహించారుగానీ నీతినికాదు. వాళ్లది విధ్వంసాత్మక (nihilist) వైఖరి అనడం శుద్ధపొరపాటు. కుచమర్దనాలూ,మకరధ్వజునికొంపలూ జుగుప్సను కలిగించనట్టయితే, సంస్కృతంలో లేని ''వుచ్చ'', ''పీతిరి ముడ్డి'', ''వూస పిర్రలు'' వగైరా ఎందుకు కలిగించాలి? మర్యాదరామన్నలు గీసినగిరులలో ఉండి పోవడానికి ఈ కవులు సిద్ధంగాలేరు.

సాహిత్యంలోగాని, ఇతర కళల్లోగాని, సెక్స్ అంటే బూతుమాటలు రాయడమో బూతు బొమ్మలు వెయ్యడమో కాదు. నిజానికి బూతు అనేది అనేవాళ్ళ నోళ్లలోనే ఉందని, లేదా మనస్సుల్లో దాగుందని అనవచ్చు. శ్రీశ్రీ అంత మాటా అన్నాడు. నగ్నరూప ప్రదర్శనం 'సెక్స్' అనిపించుకొంటుందా అంటే,

ఏ ప్రయోజనాన్ని ఆశించి ఆ ప్రదర్శనం జరుగుతుందో ఆ ప్రయోజనాన్నిబట్టి నిర్ధరించాలి గాని, నీతి దృష్టితోటి మాత్రమే కాని నిర్ధరించ గూడదని జవాబు. నగ్నరూప ప్రదర్శనమే నింద్యమైతే, వీనస్ ఆఫ్ మిలోను, వర్ధమాన మహావీరుని ప్రతిమలను పగల గొట్టాల్సిందే. కళా దృష్టితో చేసిన ఏ రూపమైనా తిలకించదగిందే.

''సెక్స్‌లో X కు అర్థం తీస్తూ'' చలం కలం పట్టుకుని ముప్పయ్యేళ్ళకు పైబడ్డ తర్వాత ఇప్పుడు కూడా 'సెక్స్' 'సెక్స్' అని మొత్తుకోవడం తెలుగువాడి గబ్బుడాయి తనానికి గానీ ఉష్ట్రపక్షి తనానికి గానీ నిదర్శనం. ''అభిసారికి కడసారి'' అనే సర్రియలిస్టు(?) గేయంలో కనుమలోని కొలిమి, నాచు నిండిన కోనేరు వగైరా సంకేతాలద్వారా శ్రీశ్రీ లైంగికంగానే రాశాడో మరోవిధంగా రాశాడో అర్థం చేసుకోలేని దయనీయమైన స్థితిలో విమర్శకులూ సమీక్షకులే ఉంటూంటే, పాఠకులమాట చెప్పడం దేనికి?

అమలిన శృంగారమంటూ, ఊహలో తప్ప, లేదు. శృంగారం ఎక్కడా ఎప్పుడూ మైథున శృంగారమే. సదరు మైథునాన్ని ఆద్యంతాలూ తెరమీదికెక్కించి చూపడమే గాక, ప్రేక్షకుడు కూడా స్వయంగా పాల్గొనేటట్లు చెయ్యడం పాశ్చాత్య సమాజంలో ఇటీవల జరుగుతూంది. ప్రత్యక్ష రతి లక్షోపలక్షల ప్రేక్షకుల కళ్ళముందే సాగుతూంది. మనదేశంలో కూడా 'జెట్‌సెట్' లాంటి తండాలు ఇలాంటి ప్రదర్శనలకు ఎగబడుతున్నారు. అన్నిటినీ అనుమతించే సమాజం (permissive society) కోసం తహతహ లాడుతున్నారు. నిన్నటి 'అవినీతి' నేటి 'నీతి' అవుతూంది. దీన్ని ప్రోత్సహించాలని నేనను గాని అర్థం చేసుకోవాలని అంటాను.

పాశ్చాత్య సమాజం కుళ్ళి వ్యాధిక్రిములతో లుకలుక లాడుతున్నదని, బూర్జువా వ్యవస్థ కుక్కమూతి పిందెలు వేస్తున్నదని, వివాహ సంస్థ శిథిలప్రాయమై పోయిందని చెప్పి ఈ సాంఘిక, కళా ధోరణులను బోధపరచుకోవచ్చు కాని, ఇది ఒక్కటే దానికి జవాబు కాదు. మనదేశం, మన సమాజం ఇంకా పాశ్చాత్యదేశాలు సాధించిన 'అభివృద్ధి'ని సాధించలేదుగదా, మన యువకులు ఎందుచేత ఆ 'అభివృద్ధి' కోసం అంగలారుస్తున్నట్టు? ఫేషన్ ఒక్కటే కారణం కాదు. మన సమాజం ఇంకా నిర్బంధాలకూ నియమాలకూ లోనై ఉంది. కొన్ని షరతులకు లోబడితే తప్ప బహిరంగంగా వెండితెరమీద ముద్దాడుకోవడానికి కూడా మన 'సంప్రదాయం' వెనుకాడుతూంది. ఈ నిర్బంధ నిషేధాలవల్ల 'అవినీతి' రహస్య జీవితం గడపవలసి వస్తున్నది. ఉదాహరణకు ''మధుసాహిత్యం''. సాంఘిక సమస్యలకు నైతిక పరిష్కారాలు తగవని చెప్పడానికి ఎన్ని ఉదాహరణలైనా ఇవ్వవచ్చును. 'సెక్సు' మనిషికిగల ప్రాథమిక అవసరాలలో ఒకటి అని గుర్తిస్తే , జీవితంలోనూ కళలోనూ దానికి ఉచితమైన స్థానాన్ని ఇవ్వక తప్పదు. నీతి దృష్టి ఈ అవసరాన్ని తగ్గించి వెయ్య జూచినప్పుడు, ప్రమాదం సంఘానికంతా మూడుతుంది. నీతి సార్వకాలికమూ సార్వజనికమూ అయినా కాలానుగుణంగా మారుతుంది. సెక్స్ అలా మారదు. మారని నీతి నిర్బంధానికి దారి తీస్తుంది. నిర్బంధం మనస్సుని పితూరీకి ఎగదోలుతుంది. సెక్స్‌కీ నీతికీ రామ రావణ యుద్ధం ఎప్పుడూ తప్పదు. కళాకారుడు సంఘ బాహ్యుడో సంఘ విరోధో అయితే తప్ప, ఈ రెండింటినీ వాటి వాటికి ఉచితమైన స్థానంలో నిలుపుతాడు. దుర్గుణాన్ని ఆకర్షవంతం చేసి జనం మనస్సుని వక్రింపజేస్తే కళ తన ఉపదేశాత్మకతను అంతరింపజేసుకొంటుంది.

**కళకు అవ్వా బువ్వా, రెండూ కావాలి.**

---

నోట్సు

1. రాధికా సాంత్వనము : ముద్దుపళని 1, 113
2. రాధికా సాంత్వనము : ముద్దుపళని 1, 144
3. రాధికా సాంత్వనము : ముద్దుపళిని 1, 148

4. మనుచరిత్రము : అల్లసాని పెద్దన II. 62
5. నాటకోపన్యాసములు : రాళ్ళపల్లి అనంత కృష్ణశర్మ, 116
6. నాటకోపన్యాసములు : రాళ్ళపల్లి అనంత కృష్ణశర్మ, 117
7. కవిత్వతత్త్వ విచారము : కట్టమంచి రామలింగారెడ్డి, 94
8. కావ్యాలంకార సంగ్రహము : సన్నిధానం సూర్యనారాయణ శాస్త్రి, 307 314-315
9. శ్రీనాథుడి నలుణ్ణి విడిచిపెట్టకపోతే పోయె, శివుణ్ణి కూడా విడిచిపెట్టలేదు
10. ఉత్తర హరివంశం, పంచమాశ్వాసం
11. కళా పూర్ణోదయం : పింగళి సూరన, VII, 121-137.
12. THE CONTINENT OF CIRCE : Nirad C. Chaudhuri, ch.10
13. భర్తృహరి సుభాషితము : వైరాగ్య శతకము, సంఖ్య 94, ఏనుగు లక్ష్మణకవి అనువాదం. EXASPERATING ESSAYS లో 'భర్తృహరి' గురించి డి.డి. కోశాంబి రాసిన వ్యాసానికి నా ఆంధ్రీకరణం ''అభ్యుదయ'' సంపుటి 4 సంచిక 10 (1958 అక్టోబరు)లో అచ్చు పడింది. ఈ దృక్పథానికి కోశాంబి మూలం.
14. ఈ పేరగ్రాఫులోని భావాలన్నీ నీరద్ సి. చౌదురివే. వాటిని సంక్షేపించడం వరకే నా బాధ్యత.
15. కమ్యూనిస్టు ప్రణాళిక : మార్క్సు, ఎంగెల్సు, రాచమల్లు రామచంద్రారెడ్డి అనువాదం, 54-55.
16. STUDIES IN A DYING CULTURE, 45
17. STUDIES IN A DYING CULTURE, 153
18. LOVE: Plato, The Bible And Freud, Douglas N. Morgan.
19. దక్షిణాంధ్ర సాహిత్యము - గుణ విశేషములు, 27
20. వ్యాస చంద్రిక - కావ్యాలలో శృంగారం, 11
21. వ్యాస చంద్రిక - కావ్యాలలో శృంగారం, 15
22. ఆంధ్ర సాహిత్య పరిషత్పత్రిక, రజతోత్సవ సంపుటము, 35-37
23. CONCERNING AN ALLEGED OBSCENE INDIAN PICTURE:- James H. cousins - THE HINDU, June 1923.
24. నేటి కుష్టు వ్యవస్థపై దిగంబర కవులు, సంపుటి 3, 79.
25. శ్రీశ్రీ సాహిత్యం, రెండు (కావ్యవిభాగం), 142.
26. The Illustrated weekly of India, 23-4-1972, 36-39.

("కళ" అయిదవ సంపుటి - 1972)

## Steps to Stress - proof your body

**Learn to assert yourself**

"Evidence shows that peoeple who allow themselves to be pushed around suffer far more from stress and pressure than more assertive individuals. You don't have to be aggressive, rude or unpleasant. You simply have to be more aware of your own needs and wishes and more prepared to stand your ground. Learn to stand up yourself. Learn to say "no" when you really don't want to do something. You'ill find that you feel more comfortable and suffer far less from stress. Surprisingly, you'll also find that other people treat you with more respect and consideration".

# HISTORICAL EVOLUTION OF LOKAYATA

- Dr. K.B. KRISHNA
M.A., Ph.D. (Harvard)

*Dr. Katragadda Balakrishna (1898-1948) born in a agriculture family, in a village called Inturu, Tenali taluq, Guntur district. He went to England, joined in "London School of Economics" aiming to become I.C.S. For reasons beyond control he could not succeed and from there he went to Harvard University.*

*He returned to India, and took an active part in the first Tamilnadu Students Conference. Having accepted the methodology of Marxism as the best scientific method of investigation, andan academic theorist he soon landed himself in Jail as a communist detenue. There also he did not give up his scholastic inclinations. He taught Capitalto the co-detenues of Vellore Central Jail in the most unconventional form of student participation and teacher guidance. He has written a number of books. "Theories of Kingship in Ancient India", "Political & Social Thought of Early Buddhist Writers" and "Studies in Hindu Materialism" are some of his works.*

*Dr. K.B. Krishna, a brilliant scholar committed to social advancement, a valiant fighter against imperialism and a steadfast champion of working class, died unknown, unhonoured and unwept in our country.)*

Lokayata is explained by Wilson as "the system of atheistical philosophy taught by Charvaka", and by the Petersburg Dictionary as "materialism". But in the Buddhist Suttas, Lokayata is mentioned as one branch of a good Brahmin's learning. If Lokayata means "materialism", how could a good Brahmin master it as one branch of learning? It follows that Lokayata means here "naturelore".

Kumarila Bhatta uses the term in the sense of "atheistic" The exact phrase would be Nastika, as opposed to his own Astikapatha : that is, the system or the man who says "there is not", an infidel. This is somewhat wider than atheist. It comes in Kumarila's mouth to much the same thing.

Sankara uses the word Lokayata several times and always in the same specific sense, as the view of those who look upon the soul as identical with the body, as existing only so long as the body exists, not continuing, after death, in a new condition and separate from the body. Brahma-Jala Sutta controverts a similar view. This view is constantly referred to throughout the Pitakas. But it is never called Lokayata in the Pitakas. It

seems to be the view that there is a soul; but that it diffused through the body, and dies with it; and is not a separate unity, within the body but not of it, which flies away from the body after death. So the translation of the word "Lokayata" into "materialism" is not quite exact at this stage.

Later Buddhist dialogues regard Lokayata as false knowledge:

"There is a teacher who affirms and holds that there is no such thing as alms, or sacrifice, or oblations: no such things as the fruit and harvest of deeds good or bad; no such thing as this world or the next; no such thing in this world as a recluse or brahmin who has triumphantly walked aright, so that, of and by himself, he has comprehended this world and the next and makes them know to others. A man--he avers--is composed of the four elements. At his death the earth resumes and absorbs his earthly elements, water his watery elements, fire his fiery elements, and space his faculties. A bier and four bearers go off with the dead man, whose remains are visible as far as the channel--ground where his bones within and bleach. Oblations are words and nothing more; alms giving is nonsense; --it is a sham and a lie and idle chatter to assort the contrary. At the body's dissolution sages and fools alike are out off and perish, without any future after death"

This teaching is called an antithesis to higher life. The teaching referred to above, is that of Ajita Kesa Kambalin.

Sometimes Buddhagosha speaks of the Lokayata as foolish chatterers. A Pali commentary of 12th century A.D. warns the Buddhists not to follow Lokayata chatter--disputations concerned with useless matters.

The Jaina Literature confirms the Buddhist evidence. The philosophy of the Nastikas or those who deny the existence of the soul was well known to the Jains. There is a reference to those who deny and ignore the tenets of Nigranthas. Silanka understands this as an allusion to the followers of Brihaspati.

A more precise reference speaks of those that profess exclusive belief in the five gross elements namely air, earth, water, fire and sky Silanka states that they hold that there is nothing beyond what is perceived by the senses, the past never returns, there is no Karman or its effects. The dead never come back, there is no future life, and that the body is but the fortuitous combination of the elements.

The parable of the Lotus pool states the doctrine in the following manner:

"There are only five elements through which is explained whether an action is good or bad. The five elements are not created, directly or indirectly, nor made; they are neither effects nor products, they are without beginning and end, they always produce effects, are independent of a

directing cause, they are eternal. What is does not perish, from nothing nothing comes. All living beings are things, the whole world consists of nothing but these five elements. They are the primary cause of the world even down to a blade of the grass. A man buys or causes to buy, kills or cuases to kill, cooks or causes to cook, he may even sell and kill a man--and even then he does not do any wrong"

This doctrine is a combination of materialist, eternalist, and anarchist ideas. The Jains understood the Lokayata sometimes as such. They are called Nastika-Vadin and Lokayata-Vadins.

**Sankara says** : There is thus according to them, no soul, separate from the body, and capable of going to the heavenly world or obtaining release. An unknown author of a Jataka commentary of the fifth century speaks of the uselessness of their discussions.

The Maha-Bharata has precisely the same use of the word as the Pitakas. The passage in Maha-Bharata gives a list of the accomplishments of learned Brahmins who are said to be masters of Lokayata. Being mentioned at the end of the list, it may be inferred that this branch of learning is meant to be taken as of minor importance. But it is not yet considered unfavourably, much less opporbiously. And the Petersburg Dictionary points out that the word may possibly, in this passage have some other meaning than "materialism".

In the Ramayana the word is also in a list but the Lokayatika are blamed as "clever in useless things". In the Saddharma Pundarika, of 2nd century A.D. the Mahayanist regards Lokayatikas as low people. The Jaina book "Bhagavati" which Weber puts at about 2nd century A.D., puts the Lokayatikas in a similar list of blameworthy persons.

A Tamil classic "Manimekhalai" written about 2nd century A.D. speaks of ten philosophical systems. Bhutavada is mentioned as one of them. Bhutavadaor the atheistic system is treated as almost the same as the Lokayata school. The heroine of ""Manimekhalai" asks Bhutavadi (materialist) for his version of philosophy.

He said:

"Just as when the flower of Taduki (Bauhinia recemosa) and jaggery (crude sugar) with other things are mixed fermentation springs into existence, so when the elements combine, there springs a consciousness of feeling. When they break up, this consciousness will also break up and disappear just as the sound ceases when a drum is taken out into its parts. Any one of these elements, when it is in life and has this consciousness, and when it has neither of these, springs into existence from out of the same element. This is the true course of things. Other details of the teaching that I may have to expound, and the Tatvas that I may have to explain are the same as those of the Lokayatas. Among the Pramanas (Instruments of knowledge), Pratyaksha

(perception) is the one admissible, even Anumana (inference) is to be rejected. That which exists in the present, and that which we enjoy in this present life are the only two states of existence; that there is another life and the enjoyment of the result of our deeds in it, are both of them false".

After listening to this discourse of Bhutavadi, the heroine laughed in scorn at Bhutavadi's arguments.

The text also speaks of Brihaspati as the founder of Lokayata. It also says that this system is based on Pramana abhyasas, those that resemble instruments of knowledge. They are (1) knowledge by direct contact, by which we learn the existence of all that exists; (2) mistaken conception, such as taking the mother of pearl for silver; (3) doubt, remaining unsettled whether that which appears before the eye is a stump of wood or a man; (4) deciding without conviction, as in mistaking a stump of wood for a man; (5) not understanding even on seeing, such as not understanding a creature to be a tiger even after seeing it prowling near; (6) asserting as existent that which does not exist, as in speaking of the horns of a rabbit understandable only by the use of the expression, and not by actual existence of the thing connoted by the word; (7) feeling that which is plainly felt by experience, such as attempting to prove that fire is destructive of mist, and (8) perception by assumption, such as taking a couple to be one's father and mother on the statement of others.

Of course, the text is written by Sattanar who is a Buddhist by conviction. We infer from this, that according to this Buddhist in Southern India, Lokayata is founded on false instruments of knowledge.

This text is important in another direction. It shows the penetration of these materialist ideas into the southern part of India, and their existance side by side with other systems of Indian Philosophy.

In the Milinda, the word is used signifying wordy disputations and wrangling quibbles. It is also used for a branch of knowledge.

In the Harsha Charita the Lokayatikas are classed as heretics.

Santaraksita and Kamala Sila of about 8th century A.D. refer to Lokayatas-Kambalasvatara and Purandara.

Bhagawadgita, an eclectic work refers to Lokayata almost in abusive virulent terms.

In the works of the fourteenth century and later the Lokayata system is fathered on Charvaka.

Most these reference to Lokayata are made by those who are opposed to that doctrine. They dealt with it only so far as is necessary to contrast their own position.

Courtesy :
**MILINDA PUBLICATIONS**, Guntur.

(To be continued...)

# FORM IV (SEE RULE 8)

Statement about ownership and other particulars of MISIMI

| | | |
|---|---|---|
| 1. Place of Publiation | : | 1-1-60/5, Iftekar Mansion Lane<br>RTC 'X' Roads, Musheerabad<br>Hyderabad-500 020 A.P. |
| 2. Periodicity of its Publication | : | Monthly |
| 3. Priner's Name | : | ALAPATI RAVINDRANATH |
| Whether citizen of India | : | Yes |
| If foreigners, state the country of origin | | |
| Address | : | 1-1-60/5, Iftekar Mansion Lane<br>RTC 'X" Roads, Musheerabad<br>Hyderabad-500 020 A.P. |
| 4. Publisher's Name | : | ALAPATI RAVINDRANATH |
| Whether citizen of India | : | Yes |
| If foreigners, state the country of origin | | |
| Address | : | 1-1-60/5, Iftekar Mansion Lane<br>RTC 'X" Roads, Musheerabad<br>Hyderabad-500 020 A.P. |
| 5. Editor's Name | : | ALAPATI RAVINDRANATH |
| Whether citizen of India | : | Yes |
| If foreigners, state the country of origin | | |
| Address | : | 1-1-60/5, Iftekar Mansion Lane<br>RTC 'X" Roads, Musheerabad<br>Hyderabad-500 020 A.P. |
| 6. Names and address of invidicuals who own the newspaper and partners of shareholders holding more than one percent of the total capital. | : | ALAPATI RAVINDRANATH<br>337-A, Road No.10,<br>Jubilee Hills,<br>Hyderabad-500 033. |

**I, ALAPATI RAVINDRANATH,** hereby declare that the particulars given above are true to the best of my knowledge and belief.

Sd/-
**ALAPATI RAVINDRANATH**
Publisher

Date : March 1, 1995.

# ఏకలవ్య

– సతీష్‌చందర్.

ద్రోణాచార్యుల వారికి దుస్వప్నం వచ్చింది. అర్జునుడు విల్లు ఎక్కుపెట్ట లేకుండా వుంటే ఏకలవ్యుడు ఎగతాళిగా నవ్వుతున్నాట్ట. చప్పట్లు కూడా కొడుతున్నాట్ట. తేరిపార చూస్తే ఒక్కొక్క చేతికీ అయిదువేళ్ళు చొప్పున రెండు చేతులకూ పదివేళ్ళు లెక్కతప్పకుండా వున్నాయిట. (స్వప్నాల్లో కూడా సినిమాల్లో లాగ మధ్యమధ్య క్లోజప్ షాట్స్ వుంటాయి కదా!) అర్జునుణ్ణి కూడా తేరిపారచూశాడు. కుడిచేతికి బొటనవేలు లేదు (వ్రేలు అనొచ్చుకాని – రేఫం ఇక్కడ వడ్డాణం లాగ బరువుగా వుంటుందని అనడంలేదు). పైపెచ్చు ఆ వేలు వుండాల్సిన భాగంలో నెత్తురోడుతోంది. పొరబడుతున్నానేమో అనుకొని యిద్దర్నీ మార్చిమార్చి చూశారు ద్రోణాచార్యులు.

తాను చూస్తున్నది నిజమే.

ఏమిటీ విడ్డూరం? తాను గురుదక్షిణగా తీసుకొన్నది.

ఏకలవ్యుడు వేలయితే అర్జునుడి వేలునుంచి నెత్తురు రావడం ఏమిటి?

ద్రోణాచార్యుని ప్రియాతి ప్రియశిష్యుడు అర్జునుడు.

కనీసం విల్లు చేబూని బాణాన్ని సంధించలేకపోవడమేమి?

అవమానం అర్జునుడికి కాదు ద్రోణాచార్యునికి. విలువిద్యలో సాటిలేని ప్రవీణునిగా తీర్చిదిద్దాలనుకున్న తన ఆశలు ఫలించలేదు. తన శ్రమ వృధా అయింది. స్వప్నం కొనసాగుతూనే వుంది. అర్జునుడు అష్టకష్టాలూ పడుతున్నాడు. విసిగిపోయి విల్లంబులు కింద విసిరికొట్టబోయాడు.

అర్జునా, ఆగు తొందరపడకు అదుగో పైన మత్స్యయంత్రంపై దృష్టి సారించి మిగిలిన వేళ్ళతో బాణాన్ని సంధించు నీ గురువుగా ఆదేశిస్తున్నాను .

ఇలా ద్రోణాచార్యుడు అన్నాడో లేదో

అర్జునుడు బాణాన్ని సంధించాడు. బాణం మత్స్యయంత్రంవైపు పోకుండా నేరుగా వచ్చి ద్రోణాచార్యుని గుండెల్లో దిగబడింది. ''హా! అర్జునా!! '' పెద్ద పెట్టున ద్రోణాచార్యుడు కేకపెట్టాడు. ఆ కేకతోపాటు ద్రోణాచార్యుడు స్వప్నం వదిలి జీవితంలోకి వచ్చాడు. ఇంతవరకూ జరిగింది స్వప్నం మాత్రమే అయినందుకు చాలా ఆనందించాడు. ఆవులించి, కళ్ళు నులుముకొని లేచి కూర్చొన్నాడు.

ఎదురుగా ఏకలవ్యుడు –

రెండు చేతుల్తో, తొమ్మిది వేళ్ళతో నమస్కరిస్తున్నాడు.

''దీర్ఘాయుష్మాన్ భవ'' ద్రోణాచార్యులు దీవించాడు. ''దిక్కులేనివాణ్ణి శపించకండి గురుదేవా!'' ఏకలవ్యుడు ప్రాధేయపడ్డాడు.

''ఇదేమిటి? దీవిస్తుంటే శపిస్తున్నానంటున్నాడు'' ద్రోణాచార్యుడు ఆలోచనలో పడ్డాడు.

''అవేం మాటలు ఏకలవ్యా!'' పైకి యిలా అన్నాడు.

''నిజమే అన్నాను. గురుదేవా! విద్యలేనివాణ్ణి ప్రతిభకు దూరమైనవాణ్ణి నాలాంటివాడికి దీర్ఘాయుష్షు శాపం కాదా?'' ద్రోణాచార్యుని మనసు చివుక్కుమంది. ఏకలవ్యుడిని ఎలాగయినా సంతోష పెట్టాలనుకొని తనకొచ్చిన స్వప్నం మొత్తం చెప్పాడు.

''ధన్యుణ్ణి గురుదేవా. ధన్యుణ్ణి మీ స్వప్నం నన్ను విద్యావంతుణ్ణి చేసింది'' ఏకలవ్యుడు ముకిళిత హస్తాలతో ప్రణమిల్లాడు.

''అదెలా ఏకలవ్యా? ''

''నాకు, బొటనవేలు లేకపోయినా నష్టంలేదు. మా గూడెంలో నన్ను చూసి నవ్వేవాళ్ళుండరు. మత్స్య యంత్రాలను మేము కొట్టనవసరంలేదు. పైగా నాది నేర్చుకున్న విద్య. నేర్పిన విద్యకాదు. అర్జునుడు అలాకాదు కదా. ఆయన రాజ్యాల్నేలాలి ద్రౌపదిని వరించాలి. అన్నిటికీ విలు విద్య కావాలి. అలాంటి అర్జునుడికి బొటన వేలు కలలోనయినా లేకపోవడం బాధాకరమే. మీరుమీరుగా మేం మేంగా వుండాలంటే మేం విద్యలు నేర్వకూడదు. ఈ విషయం తెలిసి నన్ను విద్యావంతుణ్ణి చేశారు.''

''ఏకలవ్యా!?''

''గురుదేవా! ఈ విద్యకు గురుదక్షిణ ఏమిమ్మంటారు?

నా రెండు చేతులూ ఇమ్మంటారా? ఇక కలలో కూడా చప్పట్లు కొట్టను .''

ఈసారి ఏకలవ్యుడికి కలవచ్చింది. అంపశయ్యపై భీష్ముడు బదులు ద్రోణాచార్యుడు పవళించివున్నాడు. అర్జునుడు పాతాళగంగను భువికి లాగి గురువు ద్రోణాచార్యుని దాహం తీర్చడం కోసం బాణం మీద బాణం సంధిస్తూనే వున్నాడు. గంగ బయటకు రావడం లేదు. ద్రోణాచార్యుని బాధని చూస్తూ అర్జునిడికే కాదు ఏకలవ్యుడికి కూడా ఏడుపొచ్చింది. ద్రోణుడికి ప్రియ శిష్యుడు ఒక్క అర్జునుడే కావచ్చు. కాని అదే ద్రోణుడు ఏకలవ్యుడికి కూడా ప్రియాతిప్రియమైన గురుదేవులు. అందుకే, అంటరానివాణ్ణన్న సంగతే, బొటనవేలు లేదన్న సంగతే కూడా మరచిపోయి విల్లంబుల్ని అందుకొని అర్జునుని ప్రక్కన నిలబడ్డాడు.

'' అర్జునా! ఆకాశగంగ నీ మాట వింటుందేమో కాని, పాతాళగంగ నామాటే వింటుంది. ఉచ్చనీచాలు మనకే కాదు నీళ్ళకి కూడా వుంటాయి. నన్నే బాణాన్ని సంధించనివ్వు'' అని నాలుగు వేళ్ళతో నేల మీదకి బాణాన్ని సంధించాడు. పాతాళగంగ పెల్లుబికింది. ద్రోణాచార్యుని దాహం తీరింది.

''గురుదేవా! మీ జీవితమే కాదు మీ మరణం కూడా మీ చేతుల్లో లేదు, కౌరవ సంహారం జరక్కుండా మీరు మరణించలేరు''.

ఏకలవ్యుడు ద్రోణునికి చెప్పాడు. ద్రోణుడికి కళ్ళు చెమర్చాయి. అంపశయ్య మీదనుంచి పైకిలేచాడు. ఏకలవ్యుడున్నవైపే ద్రోణుడు కదలివచ్చాడు. ఈసారి ఏకలవ్యుడికి అంటరానితనమూ, అంగవైకల్యమూ రెండూ గుర్తొచ్చాయి. వెనక్కి వెనక్కి జరిగాడు. అయినా ద్రోణాచార్యుడు ఇంకా ముందుకు వచ్చి ఏకలవ్యుడి తలనిమిరాడు.

'' ఏకలవ్యా! నువ్వు కూడా నా ప్రియశిష్యుడివే. గురుదక్షిణ పేరుతో నీ విద్యనే బలిగొన్నాను. అందుకు ప్రాయశ్చిత్తంగా నీకేదైనా వరాన్నివ్వదలిచాను. కోరుకో ఏకలవ్యా!'' ద్రోణుడి మాటలకి ఏకలవ్యుడు నిలువునా కరిగిపోయి ఆయన పాదాల మీద కుప్పకూలిపోయాడు.

''ధన్యుణ్ణి గురుదేవా! ధన్యుణ్ణి! రాజ్యాల్నేలాలని గాని, రాజుల్ని కూల్చాలని గాని మాకుండదు. ఏ విద్యయినా పొట్ట పోసుకోవడానికేనని మేం భావిస్తాం. నాలుక్కాలాల పాటూ నా జాతికి అన్నం దొరకే వరమేదైనా ఇవ్వండి గురుదేవా'' అని ఏకలవ్యుడు ఆ బాధ్యత ద్రోణాచార్యుని మీదనే పెట్టాడు. ద్రోణాచార్యుడు అర్జునుణ్ణీ, ఏకలవ్యుణ్ణీ, మార్చి మార్చి చూశాడు.

"ఏకలవ్యా! గురువు దగ్గర విద్య నేర్చుకొన్నాడు అర్జునుడు. గురువు బొమ్మను పెట్టుకొని విద్యను సాధించావు నువ్వు. ఇకనుంచి నీ వంశానికి అలాంటి అగత్యం వుండదు. ప్రతి తరంలో నీ వంశంలో వారసుడొకడికి నీ విద్య సంక్రమిస్తుంది. ఇదే నా వరం. ఒకనాటికి నీ వంశంలోనే నాలాంటి గురువులు జన్మిస్తారు. అప్పటికీ ఈ వరం పనిచేస్తుంది."

"ధన్యుణ్ణి గురుదేవా! ధన్యుణ్ణి! అత్యాశకు పోవడం లేదని మీ కనిపిస్తే మరొక్క వరాన్ని ప్రసాదించండి."

"కోరుకో ఏకలవ్యా"

"నా వారసులకి గురుదక్షిణ రద్దుచేయండి."

అని తన కుడిచేతి నాలుగు వేళ్ళూ ఏకలవ్యుడు చూపించాడు.

"అలాగే ఏకలవ్యా! నీ కోరిక నెరవేరుతుంది" అని ద్రోణాచార్యుడు అన్నాడో లేదో ఏకలవ్యుడి కుడి చేతి బొటన వేలు తిరిగివస్తుంది. ఆనందం తట్టుకోలేక ఏకలవ్యుడు సాష్టాంగపడ్డాడు. అర్జునుడికి ఎక్కడలేని కోపం వచ్చి తన విల్లుని, బాణాల్నీ ద్రోణాచార్యుని పాదాల వద్దవుంచి, నమస్కరించి వెనుతిరిగి వెళ్ళిపోతుంటాడు.

"అర్జునా! ఆగు ఎక్కడికి!" ద్రోణాచార్యుడు ఆదేశిస్తాడు.

"నన్నాపకండి. నా ప్రతిభతో, నా తపస్సు, నా అకుంఠిత దీక్షతో, మీ అనుగ్రహంతో ఈ విద్యను సాధించాను. కాని ఒక్క వరంతో దాన్ని మీరు అపాత్రదానం చేశారు. అందుకే నన్ను వెళ్ళనివ్వండి. విద్యకి గౌరవమున్న చోటికి వెళ్ళ నివ్వండి" ఎక్కడో రాజకీయ దురంధరుడు దుర్యోధనుడు హేళనగా నవ్వుతున్నాడు.

"ఏకలవ్యా! అర్జునా! మీరిద్దరికిదే నా ఆదేశం. తగవులు మాని ఆ శబ్దం వస్తున్న వైపు మీ బాణాల్ని సంధించండి" ఇద్దరూ గురువుగారి ఆదేశం పాటించబోయేరు. ఏకలవ్యుడికి మెళకువ వచ్చేసింది.

**(ఇందులోని పాత్రలు తస్కరించినవి, పరిస్థితులు ఊహించినవి)**

## Steps to Stress - proof your body

**Put more laughter into your life**

"Just how laughter and humour can have such a positive effect on the human body is still something of a mystery. But it does improve respiration, tone up the circulatory system, lower the blood pressure and increase the supply of internal healing hormones. There are several things that you can to add more laughter to your life. First try to and spend as much time as possible with cheerful, happy people. Second, keep a supply of your favourite funny books and films close to you. Third, don't be shy or embarrassed about having 'fun'".

## ప్రవాసాంధ్రుల మాతృభాషాభిమానం:

# "తెలుగు జగతి"

– శ్రీనాథ్

పట్నాల్లో స్థిరపడిపోయి, నగర వాతావరణానికి, నాగరికతకు, ఉరుకల-పరుగుల జీవితానికి అలవాటు పడిపోయిన వారు చిరకాలానంతరం స్వగ్రామం వెళ్తే ఎలా ఉంటుంది?

ఆ పల్లె వాతావరణం ఎంతగా మారిపోయినప్పటికీ అక్కడి ఒకనాటి జ్ఞాపకాలు, పరిసరాలు ఆత్మీయంగా పలుకరించగా, పైరుగాలి సేదదీర్చగా ఒక నూతనానుభూతిని పొందకుండా, గతంలోకి జారిపోకుండా ఉండగలరా?

ప్రవాసాంధ్రుల సంగతీ అంతే! వారెక్కడున్నా, అక్కడి సాంఘిక జీవనంలో ఎంతగా కలగలసిపోయినా మాతృభూమిని మరచిపోలేరు. గతాన్ని నెమరేసుకోకుండా ఉండలేరు. ''ఏదేశమేగినా, ఎందు కాలిడినా'' పుట్టి, పెరిగిన చోటునీ, ఆ వాతావరణాన్నీ జ్ఞాపకం చేసుకోకుండా ఉండలేరు. ''జననీ, జన్మభూమిశ్చ...'' కేవలం అతిశయోక్తిగా వెలువడిన కవి హృదయం మాత్రమే కాదు. అదొక వాస్తవం!
కనుక....

''నేల నాలుగు చెరగులా నెలకొని ఉన్న కోట్లాది మంది తెలుగు వారిని, వారి వారి సంఘాలను, దేశాల, ప్రాంతాల వారీగా గుర్తించి, వారినందరినీ ఒకే సమాఖ్య నీడకు తీసుకు రావటం'' అనే లక్ష్య సాధనలో భాగంగా ''ప్రపంచ తెలుగు సమాఖ్య'' అవతరించింది. 1993 జులైలో న్యూయార్క్‌లో ప్రారంభమైన ఈ సమాఖ్య తరువాత మద్రాస్‌లో వేళ్లూనుకొని 1994 డిశంబర్‌లో తొలి మహాసభలను జరుపుకుంది.

ఆ సందర్భంగా నిర్వాహకులు ప్రచురించిన బరువైన సంచిక ఈ ''తెలుగు జగతి''
'హస్త భూషణం' అనదగిన స్థాయిలో రూపొందిన ఈ 'తెలుగు జగతి' దాదాపు ఎనభై మంది వివిధ సాంస్కృతిక రంగాల్లోని ప్రముఖుల రచనల సంకలనం. వీరిలో చాలామంది తెలుగులో, కొందరు తెలుగులోనూ, ఇంగ్లీషులోనూ కూడా రాయగా మొత్తంమీద తొంభయ్ దాకా రచనలందులో చోటు చేసుకున్నాయి.

కీ.శే. విశ్వనాథ సత్యనారాయణగారి ''ఇది తెలుగు జాతి– ఇది తెలుగు భాషనుండి'' ''అయామ్ టెలుగూ... ఆర్ యూ?'' అనే కె. రామలక్ష్మిగారి విమర్శనాత్మక వ్యాసం దాకా అనేకానేక పార్శ్వాల్ని తడిమే, పరామర్శించే, పరిచయం చేసే వ్యాసాలు, కవితలు, కథలు కూడా ఉన్నాయిందులో!

గడచిన సంవత్సరాల్లో అమెరికా నుండి 'తానా' వారూ, కలకత్తా ఆంధ్ర సంఘంవారూ, మద్రాస్ రాజాలక్ష్మీ ఫౌండేషన్ వారూ, కళాసాగర్‌వారూ, ఢిల్లీ ఆంధ్ర సంఘంవారూ, బొంబాయి ఆంధ్ర మహాసభవారూ, మలేషియా సభల సందర్భంగా తెలుగు విశ్వవిద్యాలయం సాయంతో అక్కడివారూ, భారీగానూ, తరతమ భేదాల్తోనూ మెచ్చుకోదగిన సంచికల్ని ప్రచురించారు. వాటితోపోలిస్తే ఈ సంచిక నిండుగానే

ఉండనాలి. చదవదగిన, చదివి తీరాల్సిన రచనలు కొన్నున్నాయి. ముద్రణాదులన్నీ ఉన్నత స్థాయిలో ఉన్నాయి. రచయితలందరూ ప్రసిద్ధులైనవారే!

ఈ సందర్భంగా ఒక విషయం నిర్వాహకులు దృష్టిలో ఉంచుకుంటే బాగుంటుంది. ''తెలుగు వారిని, వారి వారి సంఘాల''ను ఒకే సమాఖ్య నీడకు తేదలచినట్లే...

ఈ మహాసభల సావనీర్లకు కూడా సమిష్టి ఆలోచనలతో ఒక లక్ష్యం పెట్టుకుంటే వీరందరి శ్రమా, రచయితల కృషీ, నిర్వాహకుల ఖర్చూ మరింతగా సద్వినియోగ మవుతుంది. ''అన్ని విశేష సంచికలూ దాదాపు ఒకేలా ఉంటున్నాయి'' అనే మాటకు ఆస్కారం లేకుండా ఉంటుంది.

అలాగే ఆయా రచయితల రచనలు దొరికినవి ఏవో సేకరించి ప్రచురించటంగా ఉండిపోకుండా ప్రణాళికా బద్ధంగా విషయ నిర్ధారణ చేసి, ఆయా రంగాల్లోని ''ప్రముఖుల'' మోజువదిలి ''నిష్ణాతుల''చేత కోరి రాయించి, ప్రచురిస్తే ఆయా సంచికలూ శాశ్వత విలువగలవిగా నిలిచిపోతాయి. నిర్వాహకుల శ్రమా సఫల మవుతుంది.

తెలుగు దేశాన్ని గురించి చరిత, సంస్కృతి కళలు గురించి మాత్రమేగాక పరామర్శించవలసిన విభాగాలింకెన్నో ఉన్నాయి. ఇటీవలి సంవత్సరాల్లో ఆయా విభాగాలింకెంతగానో విస్తరించి, వాటిని గురించి ప్రత్యేక సంచికలు వెలువరించ వలసిన స్థాయికి చేరుకున్నాయి.

కొన్ని కొన్ని సంస్థలు కొన్ని గ్రామాల్ని దత్తత చేసుకుని అభివృద్ధి పరుస్తున్న తీరులోనే, మన ఈ ప్రవాసాంధ్ర సంఘాలు కూడా ఆంధ్ర దేశాన్ని గురించి పాత రచనలతో తృప్తిపడక వచ్చిన ఒక్కొక్కరూ ఒక్కో రంగంలో వస్తున్న మార్పులపై అధ్యయన వ్యాసాలు రాయించి ప్రచురిస్తే, వారు తెలుగు వారికి, తెలుగు దేశానికి మరింతగా సేవచేసిన వారవుతారు. వారి కృషి చరిత్రలో నిలిచిపోతుంది. *

## Steps to Stress - proof your body

**Build up your self confidence**

"If you lack self confidence then you will constatly be pushing yourself harder and harder. Because you feel inadequate you will be exceptionally susceptible to the demands and expectations of others. You will be particularly likely to develop stress related disorders. In order to counteract your lack of confidence you need to have more faith in your own abilities. Sit down with a piece of paper and a pencil and write down all the good things you can think of to say about yourself. Write an advertisement for yourself. Pretend that you are a copywriter with the job of selling yourself to a group of potential "buyers". List all your advantages. Ignore your weaknessess - you undoubtedly already know what they are".

# ఆదిమాంధ్ర అంటుదోష నివారణసభ

(ఆంధ్రపత్రిక 1921 మార్చి 30వ తేదీ సంచిక నుంచి)

1921 మార్చి 18వ తేదీ ఉదయము 6 గంటలకు మా ఏలూరు పురమందిరమున మహారాజశ్రీ గూడూరి రామచంద్రరావుగారి యధ్యక్షత క్రింద అంటుదోషమును నివారించుటను గురించి విమర్శించి తీర్మానించుటకై నొకగొప్పసభ జరిగినది. గూడూరు రామచంద్రరావుగారగ్రస్థానము నలంకరించిరి. కేవలమగ్రకులముల వారేమోయ న్యాయమును గావించి పంచముల నణగద్రొక్కిరని నిందించుటవలని ప్రయోజనములేదు. మనలో పూర్వాచారపరాయణు లనేకులు తమ శిష్టాచారములనే నమ్మి జపతపాదులతో కాలము బుచ్చుచుండు వారినందరిని మనము నిర్బంధించి మాలవాండ్రను తమతో సమానముగ కూర్చుండ బెట్టుకొనుడని బాధించుట చాల పాతకము. రాజకీయకముగ ఆదిమాంధ్రులను నన్ని పక్షముల వారిని తమ తమ పక్షములకు చెందుడని బెల్లించుట గూడ నిపుడాచారమైంది. క్రైస్తవ మిషనరీలు గొప్ప గొప్ప యాశలను చూపించి వారిని తమ వైపున కాకర్షింపుచున్నారు. అట్టివారు క్రైస్తవ మతము నవలంబించి మన యొద్దకు వచ్చినపుడు వారికి షేక్‌హాండునిచ్చి మనతో సరిసమానులనుగ జూచుచున్నాము. మన మతమునందుండి మన దేవతలనే కొలుచుచు, మన వేషభాషల వేసికొనుచు, మనలోవారమేయని చెప్పుకొనునపుడు వారిని నిర్లక్ష్యముచేసి అన్యమతావలంబకుడైనంత మాత్రమున మనము చేయుచున్న మర్యాదలు గ్రహించి, వారు చాలమంది యితర మతావలంబకు లగుచున్నారు. అందుచే మన సంఘ బలిమి చాల తగ్గిపోవుచున్నది. కావున మనమందర మీ సంఘ క్షయము అరికట్టవలయును. దీనికి ముఖ్యసూత్రము వారికి ఈ యస్పృశ్యతను తొలగించుటకై యున్నది. ఈ యస్పృశ్యమెట్లు కలిగినదని విచారించవలసిన అవసరము మనకులేదు. దానిని తీసివేయుటకు మన శాస్త్రము లెవ్వియైన యడ్డుపడునాయని మాత్రము మనము విచారింపవలెను. వాల్మీకి, నారదుడు మున్నగు వారు నిమ్నజాతుల వారయ్యును అగ్రకులస్థులైరి. అరుంధతి మాలజాతి స్త్రీ యైనను వశిష్ఠుని భార్యయైనది. పన్నిద్దారాళ్వారిలో నొకరు మాలవాడు కావున అట్టి నిదర్శనము లనేకములు గలవు. ఇట్టి విపరీత విషయములకే తావు కలిగినపుడు, మాలవాండ్ర యస్పృశ్యత్వమును తొలగించుటకు సావకాశము లేకపోలేదు. అటులు చేయకుండ వారిని దూరముగ నుంచిన మహాపాపము మనయందే యుండి యున్నది. గాంధీ మహాత్ముడు గూడా నీ విషయమును గురించి స్పష్టముగ ననేకపర్యాయములు ముచ్చటింపుచు మనము వెంటనే వీరి యస్పృశ్యత్వమును తొలగించి స్వరాజ్య సంపాదనమునందు వీరి సహాయమును పొందవలయుననియు, నుడివి యున్నారు. స్వరాజ్య మేడు మాసములలో రావలయునని కోరుచున్న నిక్కాలములో వీరి యస్పృశ్యత్వమును బాపుటను గురించి జాగుచేయుట తగదు. మన మనేక పర్యాయములీ విషయమై యనేక తీర్మానముల చేసితిమిగాని, యీ స్థలమును దాటిన వెంటనే వానిని మరచుచుంటిమి. కావున మనోద్రఢిమను చూపుటకై ఆదిమాంధ్రులను మన మందరము రేపటి నుండి యిండ్లలో నౌకర్లుగ నుంచుకొనవలయును. భోజనగృహముల లోనికిని, వంటశాలల లోనికిని వీరిని రానియ్యకపోయినను, యిండ్లలో ప్రక్కలు వేయుట, గృహములు చిమ్ముట, బట్టలుదుకుట, నీళ్లతోడుట మున్నగు పనులకు వారి నుపయోగించుకొనవచ్చును. వారు, మన మామూలు నౌకర్లకన్న నెక్కుడు పరిశుభ్రముగను, నమ్మకముగను నుండుటయందు

లోపముండదు. అట్టి వారేదైన స్వామిద్రోహకార్యము చేయకుండ సద్వర్తనము కలిగియుండుటకై నేను హామీ నిచ్చెదను. మా మిత్రులగు డాక్టరు పట్టాభి సీతారామయ్యగారు రమారమి 15 సం.ల నుండి ఒక మాల నౌకరును తమ యింటిలోని పనులు చూచుటకై యుంచుకొని యున్నారు. ఒక్క భోజనగృహములోనికి తప్ప, యింటిలోని నన్ని భాగములయందు నీతడు తిరుగుచు, అతి నమ్మకముగ సంచరించుచున్నాడు. వేయి రూపాయల సంచినిచ్చినను అతడు జాగ్రత్తగ తిరిగి వప్పగించుచున్నాడని పట్టాభిగారే నాతో చెప్పియుండిరి. కావున సభాసదులందరు యిట్టి పనులను వారలకొసంగి, వారి యంటుదోషమును బాపి దేశోద్ధరణమును గావించవలయునని ప్రార్థింపుచున్నాను.''

అధ్యక్ష్యోపన్యాసానంతరమున ఉమ్రే ఆలీషా కవిగారు గంభీరోపన్యాసము గావించిరి. ఆరంభము నుండి అంత్యము వరకు వీరి వాక్కులు అమృతపు ధారలుగా గ్రహింపబడినవి. ఉపన్యాస సారము నిచట పొందుపరచుచున్నాము.

## ఆలీషాగారి ఉపన్యాస సారము

అగ్రకులములవారేమో అన్యాయమును గావింపుచుండిరని వారిని నిందించుటవలన ప్రయోజనము లేదు. ఎవరి కాళ్లమీద వారు నిలువబడి, ఎవరి వికాసమును వారు సంపాదించుకొనవలసిన కాలములో యొకరు తమకుసహాయము చేయలేదనుట కన్న వెర్రితనము మరొకండు కనుపింపదు. ఒకరి సహాయ మపేక్షించినచో నేడు కుర్చీపై కూర్చుండ బెట్టవచ్చును. కాని నిత్యమును నెవరు వానినటుల కూర్చుండబెట్టగలరు? కావున ఘనత కావలయుననిన దానిని పొందుటకు తగిన యర్హత యుండి తీరవలయును. ఆ యర్హతను సంపాదించుకొని నపుడే ఎవనికైన ఆధిక్యత కలుగకలదు. అది ఒకరు కలిగించిన కలుగునదిగాదు. విశ్వామిత్రుని నెవరు బ్రహ్మ ఋషిని గావించిరి? చండాలుడైన వాల్మీకికి నెవరు మహాజ్ఞానమును తెచ్చి పెట్టగలిగిరి? మాలజాతి స్త్రీయగు అరుంధితిని నెవరు వశిష్టుని భార్యగా చేయగలిగిరి? కావున వీరందరు నెటుల జ్ఞానమును సంపాదించి, అంత్య జాతివారలయ్యూ, అగ్రజాతుల వారిచేగూడ నెటుల పూజనీయులయిరో, అటులనే మన పంచమ సోదరులను తమ విజ్ఞానముచే పైకి లేవవలయును. వెక్కిరింపుకై జంజముల వేసికొందుమనినను, బ్రాహ్మణులను బలవంతముగ తాకుదుమనినను, కుర్చీలపై దౌర్జన్యముగ కూర్చుందు మనినను ప్రయోజనము లేదు. జ్ఞానమే ముఖ్యసాధనము. దాని నలవరచుకొనుటకు వలయు శక్తులను యీశ్వరుడే సృష్టియందమిడ్చియున్నాడు. పూర్వమొక మహాఋషి జ్ఞానబోధ చేయువారు లేక ఒక పామునుండియు తేనెటీగ నుండియు బ్రహ్మజ్ఞానము నంతను తెలిసికొన్నాడు. తేనెటీగ తేనె నెంతయో శ్రమపడి కూడబెట్టియును, దాని ననుభవింపకయే నితరులచే తరిమి వేయబడి తన సర్వస్వమును కోలుపోవుచున్నది. పాము అట్లుగాక దొరికిన యాహారమును భుజింపుచు, దొరకని దినము వాయుభక్షణమునే గావించునుగాని ఆహారమును కూడబెట్టుట యెరుగదు. కావున కూడబెట్టిన తేనెటీగకు యనుభవింప నవకాశము లేకపోవుటయు, కూడబెట్టకపోయినను పాముగూడ జీవించుచుండుటయు, దీనిని బట్టి చూచినచో యీ ప్రపంచమునందు బడు శ్రమల యొక్క ఫలితము శూన్యమని గోచరించి, వెంటనే బ్రహ్మజ్ఞాన ముదయించెను. కావున జ్ఞానసంపత్తి కలుగువారికి కలుగుచునే యున్నది. ఒక రుపదేశించుటలేదు గనుక కలుగుట లేదనుమాట విశ్వాసపాత్రము కాదు. కలిగిన వారందరు యాదరింపబడుచునే యున్నారు. శంకరులవారు గూడ నొక చండాలునెంతయో సన్మానించి నటుల మన గ్రంథము

ఉద్బోధింపుచున్నది. కాళిదాసు బ్రాహ్మణేతరుడైనను నేటికిని స్మరించబడు చుండలేదా? చేమకూర వెంకటకవి మన ఆంధ్ర కవిమండలి యందెంతయో స్తుతింపబడుచుండలేదా? కావున మన మనవసరముగ కువాదములు బెట్టుకొని శాస్త్రకారులు చండాలురనెందుకు నిషేధించిరని లేనిపోని వివర్శనమునకు గడంగి, 'షడ్డకః షడ్డకంచైవ ముష్టి యుద్ధం పునః పునః' అన్నట్లు తగవులాడుచుండుట యసమంజసము. మనము విమర్శనములకు గడింగిన నంతముండునా? హేతు వాదమునకు మొదలు తోకగలవా? మిరపకాయ వర్రగా నుండుననిన తియ్యగా నుండునని యింకొకడును, తియ్యగా నుండు ననుటకు దృష్టాంతరమేమయ్యా అంటే ''పంచదారకు చీమలు బట్టును, మిరపకాయకు చీమలు పట్టును'' మిరపకాయ తీపి యని దొమ్ములాడ సాగినచో ఆద్యంతములెవ్వి? చండాలురను తాకరాదను నీమము బహుకాలము నుండి వచ్చుచున్నది గావున దానిని నివారించుటెట్లుయని మనము విచారించవలెనే గాని, కుబుద్ధిని నాధారము చేసి కొనినచో ఎర్ర అద్దముల బెట్టుకొనిన వానికి ప్రపంచమంతయు నెర్రగనే కనిపించునటుల అన్నియు కుయుక్తులతోనే నిండినట్లు కనుపించును. మతాంతరులగు మహమ్మదీయులతోనే సఖ్యతను ఐకమత్యము కలిగించుకొనిన హిందువులకు వారి యంతాశ్శాఖాది వాదమును పరిష్కరించుకొనుట యొక లెక్కలోనిది కాదు. కాని అందుకు తగిన యర్హతను చండాలుడు సంపాదించుట గూడ యవసరమని నేను మనవి చేయుచున్నాను. చచ్చినగొడ్లను తినుట, గొడ్డు మాసంనమును భక్షించుట, కల్లుతాగుట, మురికిగనుండుట, జ్ఞానహీనత, యివియన్నియు వారినావహించి యున్నవి. వాని నన్నిటిని వారు తొలగించుకొనినచో ''అంటుదోషము'' మాయము కాకుండ నెట్లుండును? చచ్చినగొడ్లను తినుట మానక, గొడ్డు మాంస భక్షణము మానక, అపరిశుభ్రత వీడక, భుజము మీద చేయివేసి భాయి భాయి యనవలెనన నెటుల సాగును? కావున వీనినన్నిటిని వీరు విడువవలయునని కోరుచున్నాను. పిదప జ్ఞానాభివృద్ధికై వీరు పాటుపడవచ్చును; అది వచ్చినను రాకున్నను యిది నూతన శకము గనుక అంటుదోషము నశించును. ఇదివరకు భారతభూమి కేవల జ్ఞానభూమి యను బిరుదము నందినది. కాని పాశ్చాత్య సాంకర్యముచేత ఇపుడు కేవలము ఆర్థిక సాంఘిక మర్యాదలకు ఆటపట్టైనది. ఈ మార్పును బట్టి సాంఘిక బల మత్యావశ్యకము గాన గాంధీ మహాత్ముడుగూడ యీ యంటుడు దోషమును వెంటనే నివారించుకొనవలసిన దనియు, ఏడు మాసములలో స్వరాజ్యమును సంపాదించ వలయునుగాన వారి సహాయము మన కత్యవసరమనియు, చెప్పుచున్నాడు. పందిని, కుక్కను, నక్కను, పిల్లినిగూడ ముట్టుకొను వారలకు మనిషిని ముట్టుకొనుట దోషములోనిది కాదు. కావున, యీ యీషద్భేదములను సరుకుచేయక వెంటనే దానిని సంస్కరించుటకు అందరునూ తోడుపడవలెను.

''అస్పృశ్యతను తొలగించుటకై'' నొక తీర్మానమున మహరటా స్వాముల వారు ఆపాదించిరి. దానిని డి. నారాయణరాజు గారు ధర్మసాధని పత్రికాధిపతులగు కామేశ్వరరావు గారు, ఆళ్యం సుబ్బారావుగారు, గ్రంధి రామమూర్తిగారు ఉమ్రే ఆలీషాగారు ఆమోదించిరి. సభ వారందరిచే నది యామోదింపబడెను. ✹

Printed, Published and Edited by ALAPATI RAVINDRANATH at Kala Jyothi Process Pvt. Ltd., 1-1-60/5, Iftekar Mansion Lane, RTC X Roads, Musheerabad, Hyd-20. Ph. 612346, 612337

**Editorial NEST**

Plot No. 337-A, Road No.10, Jubilee Hills, Hyderabad-500 033. Phone : 247717.

LOOKING AT A MASTERPIECE

## *Seated Woman (Marie-Thérèse Walter)*

n January 1937, Picasso painted a series of portraits of his young nistress, Marie-Thérèse. The two nad become lovers some ten years earlier and the liaison had brought Picasso's life a new happiness and calm. In this smiling portrait, Marie-Thérèse's harmonious form has been deliberately distorted, to incorporate several views in one image. Picasso did not necessarily set out with this intention. He has concentrated on Marie-Thérèse's most saent features- her drowsy eyes, relaxed hands, rounded form and her patterned dress and hat: but, in the process of painting, the sitter has undergone a transformation, as Picasso has become immersed in the curving rhythms of his subject overall. In essence, however, Picasso's emotional response to Marie-Thérese's qualities - her serene, contemplative nature and volup tuous sensuality - has produced, at least, just as true and beautiful a portrait s any conventional likeness.





TRADEMARKS

## *Distortion*

Picasso often subjects his forms to grotesque distortions, allowing his initial idea the same mobility as his thoughts. He once stated: 'I paint what I know, not what I see' - and, in a certain sense, when one *knows* that a face has two eyes, it can seem perverse to represent it with one. Picasso was aware that his distortions were often subversive but, as he explained, 'Whatever the source of the emotion that drives me to create, I want to give it a form which has some connection with the visible world, even if it is only to wage war on that world.'